Regd No M. 1118

సింగిల్ ప్రతి 2 అణాలు






# ఆంధ్రపత్రిక

Founder : K. NAGESWARA ROW. SUNDAY EDITION

Vol, 35, ANDHRA PATRIKA, MADRAS. 7th NOVEMBER 1948. No. 214



# ప్రపంచదృష్టిని భారతదేశంపై ప్రసరింపచేసి స్వదేశానికి నెహ్రూరాక

## నాన్‌కింగ్‌కు 130 మైళ్లలో భీకర పోరాటం

### చైనా అంతర్యుద్ధంలో అత్యంత క్లిష్టదశ

### రాజీకి చాంగ్ కైషేక్ విముఖత



షాంఘై, నవంబరు 6 : మంచూరియానంతనూ ఆక్రమించిన కమ్యూనిస్టుల విజృంభణను అరికట్టి, యుద్ధమును అటో యిటో తేల్చివేసుకొనుటకు, చాంగ్ కైషేక్ ప్రభుత్వము ఉత్తరచైనానంతనూ పరిత్యజించి, ఒక్క యాంగ్‌ట్సీ నదీతీరాన మాత్రమే సైన్యముంచనిచ్చి టిసి మోహరించనున్నదని నాన్‌కింగులోని అభిజ్ఞులు విశ్వసించుచున్నారు. కమ్యూనిస్టులతో సంధిసంప్రతింపులకు చాంగ్‌కైషేక్ ఇష్టపడుటలేదనికూడా భావనుచున్నారు. తన ప్రధాన సలహాదారులతో చాంగ్‌కైషేక్ ప్రస్తుతం అతిరహస్యచర్చలు జరుపుచున్నాడు.

మంచూరియాలో ఇప్పటికి ప్రభుత్వ హస్తాలలోనే ఉన్న యింగ్‌కోవు పట్టణమును ప్రభుత్వసేనలు ఖాళీచేయుట పూర్తియైనది. ఆఖరినౌక కదిలేముందు వారు పట్టణంలోని మిలిటరీ సామగ్రిని యావత్తూ ధ్వంసం చేసి వచ్చినవి.

## నాన్‌కింగుపైకి కమ్యూనిస్టుల పురోగమనం

## షాంఘైకు అమెరికన్ నౌకలు

షాంఘైలోని అమెరికనులను ఇతర విదేశీయులను ప్రమాదపరిస్థితి యేర్పడిన పక్షంలో తప్పించుటకు కొన్ని అమెరికన్ ...

(4-వ పేజీ చూడుడు)

## ఇండొనీసియా పోరాటానికి భారతదేశ సానుభూతి, సహాయములు

### నెహ్రూ కైరో ప్రకటన పట్ల రిపబ్లిక్ వర్గాల సంతసం: జోగ్జకార్తచర్చలు విఫలమయ్యే సూచన

బటేవియా, నవంబరు 6: డచ్చి విదేశాంగమంత్రి డా॥ డర్క్ స్టిక్కర్‌కూ రిపబ్లికన్ ప్రధాని డా॥ హట్టాకూ మధ్య జరిగిన అతి ప్రధానమైన సంధిచర్చల విషయమై నేటిరాత్రి జోగ్జకర్తానుండి వచ్చిన ఒకేఒక వార్తప్రకారం "రిపబ్లిక్ అధ్యక్షుడు డా॥ సుకర్నో డా॥ స్టిక్కర్ గౌరవార్థం చేయవలసినవిందు రద్దుచేయబడినదట. డా॥ స్టిక్కర్ రేపు జోగ్జకర్తానుండి బటేవియాకు తిరిగివచ్చుచున్నారు.

### నెహ్రూకు రిపబ్లికనుల కృతజ్ఞత

డచ్చివారితో స్వాతంత్ర్యసమరం సలుపుచున్న ఇండొనీషియన్ రిపబ్లికనులకు ...

### మాదియున్‌పైకి తిరిగి వ్యూనిస్టుల దాడి

## రష్యాపై యుద్ధానికి జపాన్ సన్నాహాలు

### యుద్ధనేరస్థుల విచారణలో వెల్లడైన విషయాలు

టోక్యో, నవంబరు 6: జనరల్ హిడేకీ టోజో, మరి 24 గురు జపాను అగ్రనాయకులు ఇక్కడ అంతర్జాతీయ యుద్ధనేర విచారణ సంఘమువారిచే విచారించబడుచున్నారు. 1936 లో రష్యాపైనను, 1937 నుండి పెసిఫిక్ ప్రాంతములోనూ యుద్ధప్రయత్నములు సాగించిన నేరము జపానుపై నిరూపించబడినది. దూరప్రాచ్యమునందలి బ్రిటిషు వలసలు జయించి దక్షిణ ఆస్ట్రేలియా వరకూ ఆక్రమించు ఉద్దేశముతో జపాను రహస్యముగా నౌకాబల నిర్మాణము సాగించినట్లు రుజువైనది.

ముద్దాయీలలో షిరాటోరీ అనువాడు, రష్యాను తూర్పు ఆసియానుండి తరుముటకు జపానును ప్రోత్సహించెను. హాషిమోటో అనువాడు, బ్రిటనును ప్రతిఘటించి వాశనము చేయుటకును, హాంకాంగును పట్టుకొనుటకును జపానును ప్రేరేపించెను.

## ఢిల్లీ విమానాశ్రయం వద్ద ఘనమైన స్వాగతం

### యూరప్‌లో భారత ప్రధాని నాలుగువారాల కార్యక్రమ సమీక్ష

### డా॥ పట్టాభిగారికి జవహర్లాల్ అభినందన



న్యూఢిల్లీ, నవంబరు 6: నేటి ఉదయం 8 గంటలకు బొంబాయి నుంచి విమానములో బయలుదేరిన భారతప్రధాని పండిట్ జవహరిలాల్ నెహ్రూ మధ్యాహ్నామునకు ఢిల్లీచేరుకొనెను.

ప్రధాని నెహ్రూ పునరాగమనార్థం విమానాశ్రయము వద్ద వేచియుండుచున్న అసంఖ్యాక ప్రజాసమూహము, విమానము దిగగానే హర్షధ్వానములు చేసిరి. పండిట్‌జీకి స్వాగతమిచ్చి నగరమునకు తీసుకొనివచ్చుటకై గవర్నర్ జనరల్ రాజగోపాలాచారి, ఉప ప్రధాని సర్దార్ వల్లభాయ్ పటేల్, కాంగ్రెసు అధ్యక్షుడు డా॥ పట్టాభి సీతారామయ్యగారలు, విదేశ రాయబారవర్గ సభ్యులు ఉన్నత ప్రభుత్వోద్యోగులు ప్రముఖ కాంగ్రెసు వాదులు విమానాశ్రయమునకేగిరి. మొదటగా ప్రధాని నెహ్రూ సమీపమునకు వెళ్లి స్వాగతమిచ్చినవారు గవర్నర్ జనరల్ సి. రాజగోపాలాచారి, డిప్యూటీ ప్రధాని సర్దార్ వల్లభాయిపటేల్ డా. పట్టాభి సీతారామయ్యగారలు. పండిట్ నెహ్రూ విమానముదిగుట తడవుగనే, అఖిలభారత జాతీయ కాంగ్రెస్ ...

## వెళ్లవచ్చినందుకు సంతసం

## పాకిస్థాన్‌నుండి వచ్చిన ముస్లిమేతర ఖైదీలు

### 380 మంది విడుదల

సిమ్లా, నవంబరు 6: ఇటీవల పశ్చిమ పాకిస్థానునుండి భారతదేశము పంపివేయబడిన 1315 ముస్లిమేతర ఖైదీలలో దాదాపు 380 మంది విడుదలకాబడిరని తెలియుచున్నది. విడుదల కాబడినవారిలో ప్రముఖులు 15 మంది షికార్‌పూర్ బాంబు కేసు ఖైదీలు, సర్దార్ గురుభయాళ్‌సింగు ఒక పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు, కెప్టెన్ సురెయిన్‌సింగ్, ఇంకా ఆరుగురు సైనికులు నైయున్నారు. తక్కినవారిలో సింధు, సరిహద్దురాష్ట్రము, బెలుచిస్థానము షెయిల్‌పూరు, భావల్‌పూరులకు చెందిన 500 ఖైదీలు. ఇండియా ప్రభుత్వమువారు వారికేసులను పరిశీలించుటకై ఢిల్లీ పంపబడుదురని అనుకొనుచున్నారు. 90 మంది ముస్లిమేతర ఖైదీలు యింకా పాకిస్థాను నుండి పంపబడవలసి యున్నారని భారత ప్రభుత్వము పాకిస్థాను ప్రభుత్వమునకును దాదాపు 53 మంది ముస్లిములు భారతదేశ ...

### సర్దార్ పటేల్

### పెట్రోలు కోటాల హెచ్చింపు



అమెరికా అధ్యక్షుడు ట్రూమన్, ఆయన భార్య, కుమార్తె.

## ప్రజల ఆర్థికాభివృద్ధికి, ప్రపంచ శాంతికి నిరంతరకృషి జరుప అమెరికా అధ్యక్షుని ప్రమాణస్వీకారం

వాషింగ్టన్, నవంబరు 5: అమెరికా అధ్యక్షుడు హారీ ఎస్. ట్రూమన్ నేడు మిస్సూరీనుంచి రైలుయాత్ర చేసుకుంటూ వాషింగ్టన్‌లో ప్రవేశించినప్పుడు, 5 లక్షల మంది అమెరికన్ పౌరులు హర్షాతిరేకంతో కోలాహలం చేస్తూ, అధ్యక్షునికి అఖండమైన స్వాగతమిచ్చిరి.

తనకు స్వాగతమియడానికి వచ్చిన ప్రజాసమూహాన్ని ఉద్దేశించి హారీ ట్రూమన్ ఇట్లు ఉపన్యసించెను: "ప్రపంచమును ఎదుర్కొనుచున్న వివిధ బృహత్సమస్యలను పరిష్కరించుటకు అమెరికా తన సర్వశక్తులూ ధారపోయగలదని హామీ ఇచ్చుచున్నాను. అనేక విషమసమస్యలను ఒక్కుమ్మడిగా ఎదుర్కొనవలసిన ఈ సమయంలో, ప్రజలందరూ ప్రభుత్వంలో సహకరించవలెనని విజ్ఞప్తి చేయుచున్నాను. ...

## సోదేశంపై యుద్ధానికి అమెరికా గ్రీసును సైనికస్థావరం చేస్తున్నట్లు సోవియట్ ప్రతినిధి ఆరోపణ

ప్యారిస్, నవంబరు 5: ప్యారిసు నగరంలో సమావేశమైన అయిక్యరాజ్య సమితి ...

(4-వ పేజీ చూడుడు)



తాంబరంలో సైమానికదళ ప్రదర్శనము పరిశీలిస్తున్న భారత సైమానికదళ ప్రధానసేనాని ఎయిర్ మార్షల్ ... వీరు మొన్న శుక్రవారం మద్రాసు వచ్చిరి.

## సైనికాధికారపదవుల్లో ఖాళీలు

న్యూఢిల్లీ, నవంబరు 4: గతరాత్రి ఆలిండియా రేడియోలో మాట్లాడుచు, అసిస్టెంటు అడుజెంటు జనరలు, లెఫ్టినెంటు కర్నలు గురుచరణసింగ్ చోప్రా సైన్యములో అనేక కమిషన్డు ఆఫీసరు పదవులు ఖాళీగా నున్నవనియు, అర్హతగల భారతీయులు దరఖాస్తులు పెట్టుకొనవచ్చునవియ్యు చెప్పెను.

# 'విద్య, ఆరోగ్య, పోలీస్ శాఖలపై కేంద్రఆధిపత్యం అవసరం'

## రాజ్యాంగముసాయిదాపై చర్చ: ప్రముఖులవిమర్శ: అనేక సూచనలు

న్యూఢిల్లీ, నవంబరు 5 : భారత రాజ్యాంగముసాయిదాను చర్చించుటకు రాజ్యాంగ పరిషత్తు నేడు సమావేశమైనప్పుడు హెచ్. వి. కామత్‌గారు ఉపన్యసించుచు, కేంద్ర ప్రభుత్వ న్యాయశాఖామంత్రి డా॥ అంబేద్కర్‌గారు (రాజ్యాంగరచనా సంఘాధ్యక్షుడు) కెనడా, ఆస్ట్రేలియా, అమెరికా, బ్రిటను రాజ్యాంగములలోని భాగములను సేకరించి పొందుపరచితినని మాత్రమే చెప్పిరని, భారతదేశ ప్రాచీనసంస్కృతినుండి, మన రాజకీయ సంప్రదాయమునుండి ఏవైన భాగములను సంగ్రహించిరో లేదో తెలుపలేదనీ విమర్శించిరి. డా॥ అంబేద్కర్‌గారు ప్రతిభాపూర్వకమైన తమ ప్రసంగమున ఈవిషయమై ఒక్కమాట కూడ చెప్పలేదనీ, భారతదేశ గ్రామములను స్థానికవివాద కేంద్రములగాను, అజ్ఞానమయ ప్రాంతములగానూ న్యాయశాఖా మంత్రి వర్ణించుట శోచనీయమనీ, పట్టణవాసులమను అహంభావము గలవారు సరిగా ఇదేవిధముగ భావించెదరనీకూడ కామత్‌గారు తమ విమర్శలో చెప్పిరి. దేశమునకు స్వాతంత్ర్యమును ఆర్జించిపెట్టిన మహాత్మాగాంధి గ్రామ పంచాయతీ రాజ్యస్థాపన వాని అనువిషయమును మరచిపోరాదనికూడ ఉగ్గడించిరి.

భారత దేశజాతీయ భాషా సమస్యను ముందు నిర్ణయించి, ఆభాషలో నూత్న రాజ్యాంగమును ఆమోదించుట మంచిదని సేఠ్ గోవిందదాస్ గారనిరి. మన జాతీయ భాష ఏదైనదీ నిర్ధారణ చేయలేదు కాబట్టి, ఈరాజ్యాంగపు ముసాయిదా అసంపూర్తిగా వున్నదనే చెప్పవలసివచ్చుచున్నదని కూడ విమర్శించిరి. "మనము ఏదేశ రాజ్యాంగముల నుండి కొన్ని విషయములను సంగ్రహించితిమో ఆదేశముల రాజ్యాంగములు కూడ జాతీయ భాషను, జాతీయ గీతమును; పతాకము స్వరూపమును ముందుగనే నిర్ధారణ చేసుకున్నవి. భారతదేశము మాత్రము ఈ ప్రధాన విషయములలోనే ఇదమిద్ధమని నిర్ణయము చేయలేకపోవుచున్నది," అని సేఠ్ గోవిందాస్‌గారు ఆరోపించిరి. 'వందేమాతరం' మన జాతీయ గీతము కావలెననియు, దేవనాగరి లిపిలో హిందీ మన జాతీయ భాష కావలెననియు వీరు సూచించిరి. ఇండియా పేరు భారతదేశమని వుండవలెననియు, గోహత్యను రాజ్యాంగములో నిషేధించవలెననియు కూడ అనిరి.

నూత్న రాజ్యాంగమును సృష్టించుటలో పరిషత్ సభ్యులు అల్ప సంఖ్యాకుల హక్కులను మరువరాదని సర్దార్ భూపేంద్ర సింహ్‌గారు హెచ్చరించిరి. ఉత్తమ రాజ్యాంగమునకు గీటురాయి అది అల్ప సంఖ్యాకులలో కలిగించు విశ్వాసమేనని కూడ చెప్పిరి. "లక్షలాదిగ వున్న శరణార్థుల విషయమున పౌర స్వత్వ హక్కుల నియమనిబంధనలను సడలించుట అవసరము. అనేకనంది శరణార్థులు దేశములోని మారుమూల గ్రామములలో నివసించుచున్నారు. జిల్లామేజిస్ట్రేటువద్ద హాజరై తమపౌరసత్వమును ప్రకటించుకొనుట అవసరమని నూత్న రాజ్యాంగం ఆదేశించుచున్నది. ఈ ఆదేశము ప్రకారము నడచుకొనుటకు వీరికి సాధ్యపడు విషయముకాదు. జాతీయ భాషను నిర్ధారణచేయు విషయమున దేశములోని వివిధభాషలకు తగిన రక్షణవుండగలదని కాంగ్రెసుపక్షము లోగడ ఇచ్చిన హామీని పరిషత్ సభ్యులు గుర్తు వుంచుకొనవలెను" అని కూడ భూపేంద్రసింహ్‌గారు ఉద్బోధించిరి.

నాజిరుద్దీన్‌గారు ప్రసంగించుచు నూతన రాజ్యాంగములో "స్టేటు" అను పదమును పలుచోట్ల పలు అర్థములలో ప్రయోగించుట జరిగినదనిరి. "కొన్ని చోట్లపదమునకు అర్థముకేంద్రప్రభుత్వముగను,మరికొన్ని చోట్ల రాష్ట్రప్రభుత్వములుగను ఇంకా కొన్నిచోట్ల జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు మొదలైన స్థానిక సంస్థలగను వచ్చుచున్నది. రాజ్యాంగమునకు సమన్వయము చెప్పవలసివచ్చినప్పుడు వివిధార్థములలో ప్రయోగించిన ఈ"స్టేట్"అను పదమువల్ల కొంత తికమక ఏర్పడగలదు... రాజ్యాంగపు ముసాయిదాలో పొందుపరచిన ఆదేశ పూర్వక సూత్రములు' న్యాయశాస్త్రరీత్యా న్యాయస్థానములలో సమగ్రనీయమైనవై వుండవలెను. ఈ 'ఆదేశపూర్వక సూత్రములు' లోపముగ వున్నవని న్యాయశాఖామంత్రి అంబేద్కర్‌గారే అంగీకరించిరి. ఇవి సక్రమముగ సవరణ చేయబడగలవని ఆశించుచున్నాను' అనికూడ నాజిరుద్దీన్‌గారనిరి.

కేంద్రమునకు అత్యధిక అధికారములుగాని, అత్యల్ప అధికారములుగాని వుండరాదను ప్రధాన సూత్రముతో ఏకీభవించుచు ఆంగ్లో ఇండియన్ ప్రతినిధి ఫ్రాంక్ ఆంథోనీ ఇట్లు విమర్శించెను:

"భారతదేశమున సహజసిద్ధముగనే విచ్ఛిన్నావకాశములు వున్నవి. కాబట్టి దేశక్షేమమును, జాతీయ అఖండత్వమును కాపాడుటకు కేంద్రమునకు అత్యధిక అధికారము లిచ్చుట అవసరము. పోలీసు, విద్య, ఆరోగ్యశాఖలను కేంద్రప్రభుత్వ ఆధ్వర్యమున నిర్వహించుట అవసరము. ఇదివరలో ఇండియన్ పోలీసు సర్వీస్ అని వుండేది. వివిధరాష్ట్రములలోని వివిధ ప్రముఖ స్థానములలో ఈ శాఖవారు పని చేయుచుండెడివారు. కొత్తిగా ఏర్పాటు చేసిన కేంద్రపరిపాలకశాఖోద్యోగులను వివిధరాష్ట్రములలోని పోలీసు పదవులలో ఎంతవరకు నియోగించెదరో తెలియదు. విద్యావిషయమున కొన్ని రాష్ట్రములు ఇప్పటికే విశృంఖలముగ ప్రవర్తించ ప్రారంభించినవి.ఒకరాష్ట్రమునకు మరొక రాష్ట్రమునకు మధ్య విజ్ఞానావరోధములను లేవదీయుటకు ప్రయత్నించుచున్నవి. ఇది చాల వివాదగ్రస్తమైన విషయమే అయినను, దేశమంతటికీ పటిష్టమైన నిర్ణీత కార్యక్రమబద్ధమైన ఏకైక విద్యావిధానమును వర్తింపజేయుట ముఖ్యము. దేశ విచ్ఛిన్న శక్తులనుఅణచుటకు ఇదిఅత్యుక్తమమైన సాధనగ పనిచేయగలదు. దేశమున అనారోగ్యమును నిర్మూలించవలెనన్న విద్యాశాఖతోపాటు ప్రజారోగ్యశాఖపై కూడా కేంద్రనిర్వహణ మవసరము.

అల్పసంఖ్యాకవర్గములసమస్య సులభ పరిష్కార సాధ్యమైనదికాదు. రాజ్యాంగపు ముసాయిదాలమాత్రము ఈ సమస్యపై డా॥ అంబేద్కరుగారు నిన్న చెప్పినట్లు సామరస్యముగనే వున్నది. సాధ్యమైనంత త్వరలో భారతదేశము సార్వజనీన ప్రజాస్వామ్యరాజ్యమును స్థాపించుకొని లక్ష్యసిద్ధినిపొందవలెననే అల్ప సంఖ్యాకులు అందరూ వాంఛించుచున్నారు. దేశములోని అల్పసంఖ్యాకులకు ఈ లక్ష్య సాధనే ఉత్తమ రక్షకాగలదని వారి విశ్వాసము. కాంగ్రెస్ పార్టీ ఆశయములను పాటించుటలో అల్ప సంఖ్యాకులు కూడ చాలవరకు సుముఖ భావమునే చూపిరి. అల్ప సంఖ్యాకుల కష్ట నిష్ఠురములను కాంగ్రెస్‌పార్టీ సైతము సక్రమముగ గ్రహించగలిగినది." అని ఫ్రాంక్ ఆంథోనీ గారనిరి. డా॥ అంబేద్కర్‌గారు రచనా సంఘములో అపారమైన చాకచక్యమును చూపి, విశేషకృషి ద్వారా రాజ్యాంగపు ముసాయిదాను తయారు చేసినందుకు ఆంథోనీగారు ప్రశంసించిరి. ఏ విశాల దృక్పథములో ఈ ముసాయిదా తయారు చేయబడినదో, అట్టి విశాల దృక్పథముతోనే సామరస్యముతోనే దీనిని ఆచరణలో పెట్టుట కూడా అవసరమనిరి.

లౌకిక ప్రజారాజ్య స్థాపనా లక్ష్యమును భారతదేశము రాజ్యాంగములోని పదజాలము ద్వారాగాక, దాని ఆచరణ ద్వారా సాధించగలదని కూడా మరువరాదని ఆంథోనీగారు చెప్పిరి. రాజ్యాంగపు ముసాయిదాలో క్రమ విషయమున ప్రజలు తీసుకొన వలసిన శ్రద్ధనుగురించి ఒక్కమాట అయిననూ ఎక్కడా లేదని కృష్ణచంద్ర శర్మగారు విమర్శించిరి. "ఆదేశపూర్వక సూత్రముల అధ్యాయములో ప్రజలకు ప్రాథమిక విద్యను, ఉద్యోగమును ప్రభుత్వ మివ్వగలదని చెప్పుచున్నది. ఐతే ప్రజలచేత విధిగా పనిచేయించు బాధ్యతను ప్రభుత్వము స్వీకరించుటలేదు. దృఢకాయులైన పౌరు లందరిచేత పని చేయించ లేని రాజ్యాంగము తన లక్ష్యమును సాధించజాలదు." అని కూడా కృష్ణచంద్ర శర్మగారు వ్యాఖ్యానించిరి. సోవియెట్ రష్యా రాజ్యాంగము ప్రజలు ఐశ్వర్య దుర్వినియోగము జరగరాదని ఆదేశించుచున్నందున, భారత రాజ్యాంగమున కూడ ఇట్టి ఏర్పాటు వుండవలెననీ శర్మగారు కోరిరి. అల్ప సంఖ్యాకులకు ప్రత్యేకాధికారముల నిచ్చుపద్ధతి మంచిది కాదని కూడ హెచ్చరికచేసిరి.

రాజ్యాంగములోని ఆర్థిక ఏర్పాట్లను నిపుణుల సంఘము సంపూర్తిగా గ్రహించినట్లు లేదని టి. టి. కృష్ణమాచారిగారు విమర్శించిరి. ఆర్థిక వ్యవహారములలో పాతపద్ధతినే పటిలముగ వుంచుట వాస్తవముగ దురదృష్టమేనని కృష్ణమాచారిగారనిరి.

"ప్రస్తుత పరిస్థితులలో వ్యవసాయ సంబంధమైన ఆస్తిని, వ్యవసాయేతరమైన ఆస్తిని భేదమును పాటించుట అనవసరమని కమిటీ ఒకప్రక్క చెప్పుచూ, మరొకవైపున రాజ్యాంగపు ముసాయిదాలో ఈ విచక్షణను రద్దుచేయు ధైర్యమును చూపలేకపోయినది. ఇందుకై నేను ఒక సవరణను ప్రతిపాదించవలచి వున్నాను. రాష్ట్రాధికారములను అతిక్రమించవలెనని చెప్పు ఉద్దేశము నాకులేదు. కాని, వ్యవసాయ, వ్యవసాయేతర ఆదాయములపై దేశమంతట ఒకేవిధమైన పన్ను విధించుట ద్వారా రాష్ట్ర ఆదాయములను వృద్ధిచేయవలెనని చెప్పుచున్నాను. అమ్మకపుపన్నును నిర్వచనమును విస్తరించుటకై నిపుణుల సంఘము చేసిన సిఫార్సు చాలా "తాంటె"గా వున్నది. ఆదాయపుపన్నులో రాష్ట్రభాగమును నూటికి 50 వంతులనుండి 10 వంతులకు పెంచుచును, కార్పొరేషన్ పన్ను విషయమునను నిపుణులసంఘం సిఫార్సులకు రచనాసంఘము ఇంచుమించు త్రోసి రాజన్నది;" అని కృష్ణమాచారిగారు అనిరి. ఆర్థిక సంఘ స్థాపనవిషయమును రాజ్యాంగములో పొందుపరచవలసిన అవసరమేమున్నదో బోధపడుట లేదనిరి.

"బలీయమైన కేంద్రప్రభుత్వము అవసరమనుభావముతో ఏకీభవించుచున్నాను; కాని, రాష్ట్రాధికారములను చెక్కు చెదరనివ్వరాదు. కార్మిక సమస్యల విషయములో కూడ కేంద్రప్రభుత్వాదేశము ఉపయోగకరము కాగలవు. తన విధానములను అమలుపరచుటలో కేంద్ర కార్మిక మంత్రి ఇప్పటికే చిక్కులను ఎదుర్కొనవలసివచ్చుచున్నది. ప్రజారోగ్య విషయమునకూడా కేంద్రప్రభుత్వం ఎంతైన మేలుచేయుటకు వీలున్నది. పరిశోధనాలయములను ఏర్పరచవచ్చును. వీటన్నిటినీ సాధించుటకు బలీయమైన కేంద్ర ప్రభుత్వమెంతైన అవసరము."

భాషా సమస్యపై కృష్ణమాచారిగారు ఇట్లనిరి: "దేశమున భాషాసామ్రాజ్యతత్వము ఏర్పడకుండ చూచుట ముఖ్యము. యు. పి. సి. పి. బీహారు రాష్ట్రములలో ప్రజలు హిందీభాష మాట్లాడుచుండుట వాస్తవమే. కాని, మిగతా ప్రాంతముల మాటేమిటి? అక్కడి ప్రజలలోవిద్యాస్థితి ఏ స్థాయిలోవున్నది? ప్రతివ్యక్తికి కావలసిన స్వాతంత్ర్యము మాటేమి? దక్షిణభారతమున ఆంగ్లభాషపై ఇదివరలో జనించిన ద్వేషము ఇప్పుడు పోయినది. ఈ పరిషత్ సమావేశములో ఈ నడు నేను హిందీ భాష నేర్చుకునివచ్చి ప్రసంగించవలసినదని నిర్బంధించినఎడల నేను అటులచేయలేకపోవచ్చును. దేశమున ఆంగ్లభాషను తుడిచిపెట్టవలెనని ఆతృతవున్న ఎడల, భారతదేశమంతటనువున్న ప్రజలకు హిందీభాష రాదను విషయమునుకూడ గుర్తించుకొనవలెను. భాషవిషయమున ఇట్టి అసహనమును చూపినఎడల, బలీయమైన కేంద్రప్రభుత్వము బలీయమైన హిందీ కేంద్రముగ పరిణమించవచ్చును. దక్షిణ భారత ప్రజల తరఫున నేను ఈ హెచ్చరికను చేయుచున్నాను, దక్షిణభారతము ప్రత్యేకింపబడవలెనను వారు కొందరు అచ్చటవున్నారు. ఇట్టివర్గముల ఎత్తులు ఫలించకుండ చూడవలసిన బాధ్యత ఈ పరిషత్తుపై వున్నది. విద్యావిషయమున కొన్ని రాష్ట్రములు ఇప్పటికే అతి విశృంఖల వైఖరిని చూపుచున్నవి. దేశమంతటికీ ఏకైక విద్యావిధాన మవసరము. ప్రజారోగ్యము విషయమునను ఇట్టివిధానమే అవసరము."

రాజ్యాంగ రచనాసంఘము తనకు నిర్దేశించిన కార్యక్రమమును అతిక్రమించి పనిచేసినదని విశ్వనాథదాసుగారు విమర్శించిరి. పరిషత్తు అధికారము ఇవ్వనివిషయములలో ప్రవేశము కలిగించుకొనినదనిరి. కొన్ని కొన్ని విషయములలో ఈ సంఘము సెలెక్టుకమిటీవలెనేగాక, ప్రత్యక్షముగ రాజ్యాంగ పరిషత్తువలెనే పని చేసినదనిరి.

"మూడు కమిటీలు అందజేసిన నివేదికలను పరిషత్తు పరిశీలించకపూర్వమే, రచనాసంఘము ఈ ముసాయిదాలో నివేదికలోని అంశములను చేర్చివేసినది. కొన్ని మార్పులను సైతము చేసినది. పైగా, రాజ్యాంగపు ముసాయిదాను పరిశీలించుటకు తక్కువగా గడువు పెట్టబడినది.వివిధ వర్గములు ప్రతిపాదించిన సవరణలను పరిశీలించుటకు ఒక సెలెక్టుకమిటీని నియమించుట అవసరము," అనికూడ విశ్వనాథదాస్ గారు కోరిరి. రాజ్యాంగములోచేర్చిన ప్రాథమికహక్కులు ప్రస్తుత కేంద్ర,రాష్ట్ర శాసనములలో ఎట్టిమార్పులు కలిగించునో రచనాసంఘము జాగ్రత్తగా పరిశీలించినదా అని ప్రశ్నించిరి. ఇవి దేశములో గందరగోళము కలిగించుటకు మాత్రమే ఉపయోగపడుననని హెచ్చరిక చేసిరి. కేంద్రరాష్ట్ర ప్రభుత్వముల ఆర్థిక సంబంధములకు చెందిన ఏర్పాట్లపట విశ్వనాథ దాసుగారు తమ తీవ్ర ఆక్షేపణను తెలిపిరి. నూత్న రాజ్యాంగమును ఆమోదించిన తర్వాత మొదటి ఐదుసంవత్సరములలోనూ కేంద్రరాష్ట్ర ప్రభుత్వముల ప్రస్తుత ఆర్థికసంబంధములు యథాప్రకారముగ వుండగలవనీ ఏవీ మార్పులనీ సిఫార్సు చేయవలసిన ఆగత్యమేమిటని ప్రశ్నించిరి. ఇదివరలో వలసరాజ్యాధిపత్య ప్రభుత్వములు సైతం ఇదేవైఖరిని చూపుచుండెవే అని తీవ్ర విమర్శచేసిరి. రాజ్యాంగ రచనా సంఘమున ఎక్కువమంది కాంగ్రెస్‌వాదులకు స్థానమిచ్చినఎడల, అనర్థము జరిగి వుండెడిది కాదని చెప్పిరి.

డా॥ అంబేద్కర్, సర్ బి. ఎన్. రావు గారల కృషిని దాస్‌గారు ప్రశంసించిరి.

నూతనరాజ్యాంగ ముసాయిదా లక్ష్య నిర్వచన తీర్మానమునకు అనుగుణముగ లేదని లోకనాథ మిశ్రాగారు వ్యాఖ్యానించిరి. ఇంతలో ఫెడరల్ ప్రభుత్వ లక్షణములకంటే ఏకచ్ఛత్రాధిపత్య లక్షణములే ఎక్కువగా వున్నవనీ, బలీయమైన కేంద్రము నిరంకుశత్వమునకు దారితీయగలదనీ మిశ్రాగారు హెచ్చరికచేసిరి.

బహుళ నియోజకవర్గములు, ద్విభాషా ప్రాతినిధ్యము వున్న ఎడల అల్పసంఖ్యాకులకు తగిన రక్షణలు ఏర్పడగలవని కాజీ సయ్యద్ కరీముద్దీన్ గారు సూచించిరి. భారతదేశము కామన్వెల్తులో వుండరాదని కూడా ఉద్బోధించిరి.

ప్రొఫెసర్ కె. టి. షాగారు ఇట్లు విమర్శించిరి: "డా॥ అంబేద్కర్ గారి అభివర్ణన! కేవలమురాజకీయ దృక్పథమునే చూపినది గాని, సాంఘిక, ఆర్థిక సమస్యల జోలికి పోలేదు. ఈ రాజ్యాంగమును మనము ఎందుకోసమై ఉద్దేశించుచున్నాము? ప్రజానీకమునకు సామాజిక న్యాయమును, వాస్తవ సమానత్వమును ప్రసాదించు ధాతులే ఇందులో లేవు. ప్రాథమిక హక్కుల అధ్యాయములో సైతం ఓపికనన్ని మినహాయింపులు చూపబడినవి; ఈ పరిస్థితిలో ప్రాథమిక హక్కులే మరుగున పడిపోయినవి. దేశమున ప్రమాద పరిస్థితి,ఒత్తిడి పరిస్థితి ఏర్పడి ప్రజలు మానసికముగ అశాంతితో వున్న సమయమున రాజ్యాంగమును నిర్ణయించుబాధ్యత ఈ సభపై పడినది. దీని ఫలితముగా రాజ్యాంగపు ముసాయిదాలో ఎచ్చట చూచినను సాధారణ పరిస్థితుల కంటే అసాధారణ అవసర పరిస్థితులపట్లే ఎక్కువ శ్రద్ధ చూపబడినది. వ్యక్తిగత బాధ్యతల ప్రసక్తి ఇందులో లేదు. కేవలము మస్తిష్కముల సంఖ్యపై ఆధారపడినందుకల్ల ప్రయోజనము లేదు; వాటిలోవున్న సరుకును పాటించవలెను."

పండిత లక్ష్మీకాంత మైత్రగారు ప్రసంగించుచు, "యూనియన్ ఆఫ్ స్టేట్స్" అని వర్ణించుట బాగా లేదని, "స్టేట్" అనిన స్వతంత్ర రాజ్య మను భావము స్ఫురించుననీ విమర్శించిరి. అల్ప సంఖ్యాకులకు స్థానములను కేటాయించుటను మైత్రగారు ప్రతిఘటించిరి. దీని ఫలితముగనే దేశవిభజన సంభవించినదని హెచ్చరికచేసిరి. కనీసము రానున్న రెండు దశాబ్దములవరకైనను ఉభయశాసన సభలపద్ధతి వుండుట అవసరమనికూడా వీరు ఉద్ఘాటించిరి. వయోజన వోటింగుపద్ధతి రానున్నది కాబట్టి, ఎగువ శాసనసభ మరింత అవసరమనిరి. హిందీ జాతీయభాష కావలెనని, తాముగాని, దక్షిణభారతములోని తనమిత్రులు హిందీ మాటలాడలేక పోయిన తప్పు తమదికాదనీకూడా చెప్పిరి. వారు హిందీ నేర్చుకొనుటకు తగిన వ్యవధి ఇవ్వవలెనని సూచించిరి.

బాబూ రామనారాయణ సింగ్ గారు ఈ రాజ్యాంగపు ముసాయిదా ప్రకారము అధికారము గ్రామసీమ ప్రజలకు సంక్రమించదని విమర్శచేసిరి. ఇదివరకువలెనే ఇప్పుడుకూడ ప్రతి ఐదారు ఏళ్ళకు ఒకసారి గ్రామప్రజలు తమవోట్లను వేయుట మాత్రమే జరుగుతుందనినిరసించిరి. బ్రిటిష్ వారిహయాములోవలెనే పరిపాలన సాగుతుందనికూడ చెప్పిరి.అన్యదేశములరాజ్యాంగములనుండి సంగ్రహించినందుకు తాను నాసుగ్గాపడుటలేదని అంబేద్కర్ గారు చెప్పివున్నారు. అప్పుచేసి బ్రతికేవాడికీ, అడుక్కొని తినేవాడికీ నామర్దా ఎక్కడ వుంటుందని బాబు నారాయణసింగ్ గారు ధాటీగా అనిరి. (సభ్యులలో నవ్వు) భారతదేశ ప్రజలలో స్వకల్పనాశక్తి ఏ మాత్రం మిగిలివుండలేదా అని కూడా ప్రశ్నించిరి. ఈరాజ్యాంగపు ముసాయిదా ప్రకారము దేశములో కేవలము ఏకపక్షపరిపాలన ఏర్పడుతుందనీ, అది భారతదేశమునకు ఎంతమాత్రము ఉపయుక్తము కాదనీ రామనారాయణసింగ్ గారు హెచ్చరిక చేసిరి. మంత్రులు, ఉపమంత్రులు, పార్లమెంటరీ కార్యదర్శులతోకూడిన ఒక పెద్ద 'పటాలం' చేత పార్లమెంటరీ పద్ధతిన పరిపాలనచేయించుటకంటె, అన్యదేశీ విశేషాధికారాలిచ్చి ఆయనచేతనే ప్రత్యక్ష పరిపాలన సాగనివ్వడం మెరుగని కూడ బాబు రామనారాయణసింగ్ గారు సూచించిరి. "అన్యుడు ఎప్పుడైనా తప్పుచేస్తే అతడిని తొలగించే అధికారం వుండవలసిందే; ఆ అన్యుడే తన మంత్రివర్గాన్ని, కార్యదర్శులను ఎన్నుకొనేటట్లు వుండాలి. ఈ మంత్రులు, ఉపమంత్రులు, పార్లమెంటరీ కార్యదర్శులు అనే 'పటాలం' చేసే పరిపాలనకంటే రాక్షసునికచేత పరిపాలన చేయించుకోనాలే మంచిది. (సభ్యులలోనవ్వు) ... యాధారనాథ కొన్ని కూడా ప్రాథమిక హక్కులలో ... సెను. అల్పసంఖ్యాకులకు స్థానాలు కేటాయించుటకు నేను ప్రతికూలుడను," అని కూడ రామనారాయణసింగ్ గారు నొక్కిచెప్పిరి. బలీయమైన కేంద్ర మవసరమని నాగప్పగారు వాదించిరి. జాతీయభాషను సూచించుటకు ప్రజలకుతగిన వ్యవధి ఇవ్వవలెననికూడ సూచించిరి.

ఈ రాజ్యాంగపు ముసాయిదా కుద్ర అతుకులబొంతగావున్నదని డా॥ పంజాబు రావుదేశముఖ్ గారు విమర్శించిరి. ఇందులో ఏవిధమైన ప్రతిభగాని, విశిష్టతగాని లేదనిరి. బ్రిటిష్‌వారు వదలివెళ్ళిన పరిపాలనా యంత్రమునకు తొడుగుటకు, వీలుగ మాత్రమే ఈ 'అంగీ' తయారైనదనిరి. 'ఆదేశపూర్వక సూత్రములను ఈ పెద్దవ్యాలు చేర్చిన హామీయొకివని పలుకా ఇచ్చిరి. ... 'యూ యస్' అని ... 'యూనైటెడ్ ...' ... లేదనికూడా ... చిరి. ... చర్చలు కావలసిన సమయం ... చేర్చాలో లెవని చెప్పిరి.

పరిషత్ సమావేశము 6వ తేదీ ఉదయము 10 గంటలకు వాయిదా పడినది.

# రాష్ట్ర, కేంద్రప్రభుత్వముల మధ్య పన్నురాబడి పంపకం

## పరిషత్తు ఆర్థికోపసంఘ సూచనలప్రకారం కేంద్రంనుండిరాష్ట్రాలకుమరికొన్నికోట్లురాగలవు

### రు 250 వేతనం లోపు వారిపై వృత్తిపన్ను విధించరాదు

న్యూఢిల్లీ, నవంబరు 5: కేంద్రప్రభుత్వము రాష్ట్ర ప్రభుత్వములకిచ్చే ధనసహాయము మరికొన్ని కోట్లవరకూ పెంచవలెనని రాజ్యాంగ పరిషత్తు నియమించిన ఆర్థిక నిపుణులసంఘము కొన్ని సలహాలనిచ్చినది. ఈ నిపుణులసంఘపు నివేదిక నేడు అధికారరీత్యా ప్రకటింపబడినది.

స్థానిక పరిపాలనా సంస్థలు విధించే వృత్తిపన్ను మొదలైన పన్నులవలన వచ్చేరాబడి మొత్తమును 50 కోట్ల రూ. నుండి 250 కోట్ల రూ. వరకూ పెంచవలెనని, సంస్థానముల లోని కస్టమ్సుపన్ను లన్నిటినీ, కేంద్రప్రభుత్వమే నిర్వహించవలెననీ, అవసరమైతే వారికి పరిహారమివ్వవచ్చుననీ కూడ నళినీరంజన్ సర్కార్ అధ్యక్షతక్రింద పనిచేసిన ఈ నిపుణుల సంఘము సూచించినది. భారతరాజ్యాంగమునకు సంబంధించిన ఆర్థికవిషయిక సలహాలను కొన్నిటిని ఈసంఘముచే యిదివరలో సూచింపబడినప్పటివి రాజ్యాంగ ముసాయిదాలో చేర్పబడినవి. మిగతాసలహాల నిప్పుడు పరిషత్తు అధ్యక్షుడు ఆమోదించి అమలునకు పెట్టును.

ఈ సంఘము చేసిన ముఖ్యమైన సూచనలలో కొన్ని!

(1) కేంద్రప్రభుత్వము నిర్వహించే పన్నుల జాబితాలో పెద్ద మార్పులేవీ చేయరాదు.

(2) కస్టమ్సు పన్నులు, (ఎగుమతి పన్నులతో సహా) యంత్రసామగ్రి నిలవలపై పన్నులు, రైల్వే ఛార్జిలపై పన్నులు, పొగాకు కాక మిగత కేంద్ర ఎక్సైజు పన్నులు—వీనిపై వచ్చే రాబడి నికరపు మొత్తమంతా కేంద్రప్రభుత్వమునకే చెందవలెను.

(3) జనుముపై వచ్చే ఆదాయమును కోల్పోయిన రాష్ట్రములకు కొన్ని ఏళ్ళ వరకు నియమితమైన ధనసహాయము చేయవలెను.

(4) కార్పొరేషన్ పన్నుతో సహా ఆదాయపు పన్ను, పొగాకు ఎక్సైజు, ఎస్టేటు, వారసత్వపు పన్ను—వీనిపై వచ్చే రాబడిని రాష్ట్రములు, కేంద్రము పంచుకోవలెను.

(5) స్టాంపు పన్నులు మున్నగువాటిని కేంద్రమే నిర్వహించవలెను కాని పూర్తిగా రాష్ట్రములకే ఆ రాబడిని ఇవ్వవలెను.

(6) అస్సాం, ఒరిస్సాలకు మరింత యెక్కువగా ధనసహాయ మివ్వవలెను. తూర్పు పంజాబు, పశ్చిమ బెంగాలులకు లక్షీతకాలమువరకూ ధన సహాయము చేయవలెను.

### ఆదాయపు పన్ను

(7) ఆదాయపు పన్ను రాబడిలో నూటికి 60 వంతులను రాష్ట్రముల మధ్య పంపవలెను.

(8) పొగాకు ఎక్సైజు రాబడిలో సగమును రాష్ట్రముల మధ్య పంచవలెను.

(9) ఎస్టేటు పన్ను, వారసత్వపు పన్ను రాబడిని నూటికి 60 వంతుల చొప్పున రాష్ట్రముల మధ్య పంచవలెను.

(10) పదవినుండి విరమించిన లేక పదవిలోనే ఉన్న ఒక హైకోర్టుజడ్జి అధ్యక్షతక్రింద 4 గురు సభ్యుల కమిటీ నొకదానిని నియమించి, కేంద్రప్రభుత్వపు పన్నుల రాబడిని ఏ విధముగా రాష్ట్రముల మధ్య పంచవలెనో నిర్ణయించుపనివారికి ఇవ్వవలెను. కొన్ని రాష్ట్రములు తమకు అదనంగా ధనసహాయం కావలెనని కోరితే, వారి దరఖాస్తులను పరిశీలించు పని, ఇంకా రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షునికి అప్పుడప్పుడు తెలైనా సలహాలిచ్చు పనికూడా ఈ ఆర్థికకమిటీ కివ్వవలెను.

(11) రాష్ట్ర, సంస్థాన ప్రభుత్వములు నడిపే వ్యాపారముపైని, స్థానిక పరిపాలనా సంస్థల వ్యాపారములపైన కేంద్రప్రభుత్వము ఆదాయపుపన్ను విధించవలెను. అయితే అట్టి వ్యాపారము ప్రభుత్వ పరిపాలన కవసరమైనదే అయితే దానిపై పన్ను విధించరాదు.

(12) సంస్థానములు రాష్ట్రములవలెనే మామూలుగా బడ్జెట్‌లను, తయారు చేయునట్లు, సరియైన లెక్కల అవర్ధాలను చూపించునట్లు త్వరలో చర్యలు తీసుకోవలెను.

(13) రాష్ట్రములలో ఎట్టి పన్నులు అమలులో ఉన్నవో అట్టి పన్నులనన్నిటినీ సంస్థానములుకూడ క్రమముగా అవలంబించునట్లు చేయవలెను.

(14) భారత ఆదాయపుపన్ను శాసనమును సంస్థానములలో కూడ అమలుచేసి ఆ పన్నుపై సంస్థానములలో వసూలైన, రాబడి మొత్తములో మున్సాలిక వంతులను సంస్థానములమధ్య పంచవలెను.

ఈశాన్య సరిహద్దు ("ఏజెన్సీ") విషయములపైన, అడవిజాతుల ప్రాంతములపైన, ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వం స్వయంగా పరిపాలించే ప్రాంతములపైన మరి 3 కమిటీలు సమర్పించిన నివేదికలుకూడ నేడు ప్రకటితమైనవి. ఇది రాజ్యాంగ పరిషదధ్యక్షునికి నిరుడే సమర్పింపబడి రాజ్యాంగ ముసాయిదా రచనా సంఘమువారిచే ఆమోదింపబడినవి.

## ఫ్రెంచిఇండియా ఎన్నికలను గురించి ఇండియా రాయబారి నివేదిక

పుదుచ్చేరి, నవంబరు 5 : పుదుచ్చేరిలో ఇండియా రాయబారిగా ఉన్న రషీదాలీ బేగ్ ఢిల్లీలోని విదేశాంగ వ్యవహారశాఖ వారికి దక్షిణ దేశములోని ఫ్రెంచి వలస ప్రాంతములలో ఇటీవల జరిగిన ఎన్నికలను గురించి నివేదిక పంపినట్లు తెలియుచున్నది. ప్రధాని పండిత నెహ్రూ తిరిగి వచ్చిన తరువాత ఇండియా ప్రభుత్వమువారు తమ వైఖరి నిర్ణయించగలరు.

మాహేనుండి ఫ్రెంచి ఇండియా గవర్నరు యొద్ద నౌకపై రేపు ఉదయము తిరిగి వచ్చును.

## గంటల పంచాంగం

సర్వధారి నం॥ కార్తీక శు॥ షష్ఠి
1948 సం॥ నవంబరు 7 ఆదివారం
ఆ॥ షష్ఠి ప 7-30 ఉషా రా 8-17 వర్జ్యం రా 12-41 ల 2-27 కు.
శు॥ సప్తమి నవంబరు 8 సోమవారం
సో॥ సప్తమి ప 9-14 శ్రవ రా10-48 వర్జ్యం రా 8-12 లర-0 కు.

ఆంధ్రపత్రిక

సర్వధారి సం॥ కార్తీక శు॥ షష్ఠి
ఆదివారం

## చెరుకు వ్యవసాయదారుల సభ

శుక్రవారమునాడు నగరములో జరిగిన చెరుకు వ్యవసాయదారుల సభ తీర్మానములు, ఆ సభలో చేసిన ప్రసంగములు చాలవరకు సమంజసముగ నున్నవనుటకు సందేహము లేదు. చెరుకు ధరను నిర్ణయించి దానిని అమలు జరుపుటలో మద్రాసు ప్రభుత్వము జాగుచేసినదను విమర్శను త్రోసిపుచ్చ వీలులేదు. కడచిన సంవత్సరము ధర నిర్ణయించినది కాని ఆ ధరప్రకారము మిల్లువారు కొనునట్లు నిర్బంధించుటకు అధికారము లేదని గ్రహించినది. అందువల్ల మిల్లు యజమానుల సంఘముతో సంప్రతింపులు జరిపి, చెరకుధర టన్ను ఒకటికి రు. 54/- ఇచ్చునట్లు ఏర్పాటు చేసినది. అయితే ఈ ధరను, చక్కెర ధరతోను, కొన్న చెరుకు పిండుటవల్ల లభ్యమయ్యే రసముతోనూ ముడిపెట్టిరి. ఈ ఒప్పందమునకు వ్యవసాయదారులు సహజముగా తమ నిరసనభావము తెలిపిరి. మిల్లు యజమాని చక్కెరధరను పెంచిన దామాయిషాలో చెరకుధర పెంచలేదని వ్యవసాయదారుల వాదము. గత సం॥ము చెరకుధర టన్ను 1-కి రు. 20/- నుండి రు. 34/-కు పెంచితే, మిల్లుయజమాని చక్కెర ధరను మణుగు 1-కి రు. 40/- నుండి, రు. 80/- పెంచుటకు బదులు, రు. 100/-లకు పెంచెను. ధర నిర్ణయమునుగురించేగాక, నిర్ణయింపబడిన ధరను ముట్టచెప్పుటకు మిల్లు యజమానులు కొన్న చెరకులో రాగల రస ఉత్పత్తికి ముడిపెట్టుటగురించి వ్యవసాయదారులు తీవ్ర అసంతృప్తిని వెల్లడించుచూ వచ్చిరి. వారు అమ్మిన చెరకుకు, మిల్లు యజమానులు వెంటనే పైకము ముట్టచెప్పక, దఫాలవారీగ ఇచ్చుచున్నారు. 1947 సం॥ డిశంబరులో తీసికొనినదానికి కొన్ని మిల్లులవారు ఇంతవరకు పైకము ఇవ్వలేదనిన, వ్యవసాయదారులు ఎంత ఇబ్బంది పడవలసి వచ్చుచున్నదో వేరుగ చెప్పనవసరము లేదు. ప్రభుత్వము కలిపించుకొనుటకు ఇంతకన్న కారణ మనవసరము. బీహారు, సంయుక్తరాష్ట్రములందువలె చక్కెర మిల్లుల కంట్రోలు చట్టమును ఎప్పుడో అమలుపరచి యుండవలసినది. ఆ విధమైన చట్టమును నిర్మించి అమలుపరచుటకు తలపెట్టినదనీ, ఆ చట్టము అమలుపరచుటకు సవరణ కావలసియున్నందున ఈ లోపల 1934 సం॥ చెరుకుచట్టము ననుసరించి రాష్ట్రములో చెరుకుపంటనంతనూ కంట్రోలుక్రిందికి తెచ్చిరి. దానికనుగుణముగనే, 1948-49 సం॥ చెరకుధరను టన్ను 1-కి రు. 60/- నిర్ణయించిరి. ఈ ధరకు వ్యవసాయదారుల సభ సంతసమును వెలిబుచ్చినది. మద్రాసు ప్రభుత్వము నిర్ణయించిన ధర, సంయుక్తరాష్ట్రముల ధరకన్న ఎక్కువైనప్పటికీ, అక్కడ మిల్లుయజమానులు, తాముకొన్న ప్రతిటన్నుకు ప్రభుత్వమునకు సెస్సును ఇవ్వవలసియున్నది. అంతేకాక, సహకార సంఘముల ద్వారా మాత్రమే కొని, వారికి కమీషను ఇవ్వవలసియున్నది. మద్రాసు మిల్లులకు ఈవిధమైన నిర్బంధము లేకపోవుటేగాక, చెరకును, చక్కెరను రవాణాచేయు ధరలో రాయితీ లభించుచున్నది. అందువల్ల ఇక్కడ రాష్ట్రప్రభుత్వము రు. 60/- లు నిర్ణయించుట అన్యాయము కాదు. ఆయా మిల్లుల కవసరమైన చెరకును ఫలానిప్రాంతములందు కొనునట్లుగ ప్రభుత్వము చూడవలెనని వ్యవసాయదారుల సభ తీర్మానించినది. మిల్లులపైన ఈ బాధ్యత వేసినప్పుడు, వ్యవసాయదారులు కూడ తమ పంటను మరొకరికి అమ్మకుండ నుండవలెను. అంతేకాక, మంచిరకము చెరకును పెంచుటయందు శ్రద్ధవహించవలెను. వ్యవసాయదారులుచేరి సహకార సంఘములుఏర్పర్చుకొనిన వారివద్దనుండే మిల్లుయజమానులు చెరకును కొనునట్లు ప్రభుత్వము తోడ్పడగలదు. వినియోగదారునకు చక్కెరను క్రమమైనచౌకధరకు సరఫరాచేయవలెనను ఆశయము, అటు మిల్లువారికి, ఇటు, వ్యవసాయదారులకు ఉండిన, ఫ్యాక్టరీలను ఎవరు నడుపవలెనను ప్రశ్నకుగాని, మిల్లుయజమాని అంతస్థునుగురించిన వ్యాఖ్యకుగాని అవకాశము ఉండదు. ఎవరు ఏ వస్తువు ఉత్పత్తిచేసినను చివరకుదానిధరను భరించవలసినది వినియోగదారుడు. దేశము చక్కెర సరఫరా యందు స్వయం సమృద్ధిసంపాదించిననూ యుద్ధమునకు పూర్వముండే ధరకన్న రెండింతలు పెరిగి సామాన్యులనేకులకు అందరానిదిగ నున్నది.

చెరకుపంట సాగు పద్ధతిని అభివృద్ధి చేయుటకు వ్యవసాయ శాఖ శ్రద్ధ వహించవలెనని, ఎరువులను, పనిముట్లను ఎక్కువగా సరఫరా చేయవలెనని, వ్యవసాయ ఆదాయపువన్ను కూడదని ఈ సభవారు తీర్మానించిరి. భూమిశిస్తు, సెస్సులను చెల్లించుచుండగా, వాటికి ఆదాయపువన్ను చేర్చుట అక్రమమను వాదములో పటుత్వము లేకపోలేదు. సభాధ్యక్షులు, నాగన్నగౌడగారు రాష్ట్రములో ఇంకను చక్కెర ఫ్యాక్టరీలను స్థాపించవలెనని, అందుకు ప్రభుత్వము తోడ్పడవలెననీ సూచించిరి. ఇతర రాష్ట్రములనుండి, లక్ష టన్నుల చక్కెర దిగుమతి చేసికొనుచుంటిమనీ, చెరకుపంట అవసరమైనంత యున్నది కాని, ఫ్యాక్టరీలు మాత్రమే లేవనిరి. క్రొత్తఫ్యాక్టరీల స్థాపనకు అనుమతి ఇచ్చుటలో ప్రభుత్వము, ప్రాంతీయ అవసరములను ప్రాముఖ్యమునుగమనించవలసి యున్నది. ఇంతవరకు దేశీయ చక్కెర పరిశ్రమ నిలబడి అభివృద్ధి చెందుటకు దిగుమతులు నిరోధరూపమున దానికివ్వబడిన రక్షణ ప్రధాన కారణము. కడచిన ఆగస్టుతో ముగిసిన సం॥లో ప్రపంచ చక్కెర ఉత్పత్తి అవసరమైన దానికన్న ఎక్కువ అయినది. కాని అధిక ధరనుబట్టి దానివినియోగము అనేక దేశములందు తగ్గినది. మన దేశమునకూడ చక్కెరధర అధికముగ నున్నదను విషయమున అభిప్రాయ భేదము లేదు. 1950 సం॥ నాటికి, ప్రపంచములో చక్కెర ఉత్పత్తి యుద్ధమునకు పూర్వపు ప్రమాణము దాటగలదని అనుకొనుచున్నారు. అనేక దేశములందు చెరకుపంట అధికమగుచున్నది. క్యూబాయందు చక్కెరధర పడిపోవుచున్నదని, 10 లక్షల టన్నులను అమ్మకమునకు రాకుండ చూడవలెనని ఆదేశ ప్రభుత్వము ఆలోచించుచున్నదట. కాబట్టి విదేశాలనుండి మరీ చవుకధరకు చక్కెర లభ్యమగు పరిస్థితిని గమనించి కొత్త ఫ్యాక్టరీల నిర్మాణము గూర్చి ఆలోచించవలెను.

## రేషను హెచ్చింపు

### 7 వ తేదీనుండి అమలు వివరాలు

చెన్నపట్నం, నవంబరు 6: రేపు 7 వ తేదీనుండి రాష్ట్రంలో స్టాచ్యూటరీరేషను ప్రాంతాలలోను ఇన్‌ఫార్మల్ రేషను ప్రాంతాలందును రేషను పరిమాణము 8 నుండి 10 ఔన్సులకు హెచ్చించుటకు ప్రభుత్వము ఉత్తరవు చేసినది. ఈప్రాంతాలలో బియ్యం వాడుకచేసేవారికి 8 ఔన్సుల బియ్యం 2 ఔన్సులగోధుములు లేక రవ మైలో, జొన్నలు, మొక్కజొన్నలు ఏది యుంటే అది యిస్తారు. జొన్నలు బియ్యం తినే అలవాటు కలవారికి 4 ఔ. లు బియ్యం, 4 ఔన్సు మొక్కజొన్నలు, మైలో యితర రకాల జొన్నలు, 2 ఔ॥ గోధుమలు లేక రవ ఏదియుంటే అది యిస్తారు. జొన్నలు వాడేవారికి 2 ఔ. బియ్యం 6 ఔ॥ మొక్కజొన్నలు వగైరా 2 ఔ, గోధుమలు లేక రవ యిస్తారు.

లోటు ప్రాంతాలలోని రిలీఫు దుకాణాలలో బియ్యం వాడుక దార్లకు 6 ఔ బియ్యం 2 ఔ. మొక్కజొన్నలు వగైరా, 2ఔ గోధుమలు లేక రవ ఉభయ ధాన్యాలు వాడే వారికి 4ఔ, బియ్యం 4ఔ మొక్కజొన్నలు వగైరా, 2ఔ, గోధుములు లేక రవ, జొన్నలు వాడే వారికి 2ఔ, బియ్యం, 6 ఔ, మొక్కజొన్నలు వగైరా, 2 ఔ॥ గోధుములు లేక రవ యిస్తారు.

రేషను ఎత్తివేసిన ప్రాంతాలలో గల రిలీఫ్ దుకాణములందు బియ్యం వాడుకదార్లకు 4 ఔ॥ బియ్యం, 2 ఔ॥ మొక్కజొన్నలు వగైరా, 2 ఔ॥ గోధుములు లేక రవ, ఉభయ ధాన్యాలు వాడుకొనే వారికి 2 ఔ॥ బియ్యం, 4 ఔ॥ మొక్కజొన్నలు వగైరా, 2 ఔ॥ గోధుమలు లేక రవ, జొన్నలు వాడు వారికి 1 ఔ బియ్యం, 5 ఔ మొక్కజొన్నలు వగైరా, 8 ఔ గోధుమలు లేక రవ్వ యిస్తారు.

మొక్కజొన్నలు వగైరా ధాన్యం యిష్టముంటే కొనవచ్చు, లేదావదిలివేయవచ్చును.

అలవాటుగా గోధుమలు వాడేవారికిని, వైద్యుల సలహా ననుసరించి వాడేవారికి పూర్తి రేషను గోధుమ లివ్వబడును.

14-11-48 వ తేదీనుండి, దక్షిణార్కాడుజిల్లా (చిదంబరం తాలూకా తప్ప) కడప, కర్నూలు, బళ్లారి, అనంతపూరు జిల్లాలలో (ఇతరరాష్ట్రాల సరిహద్దు గల తాలూకాలందు మినహా) మునిసిపల్ రిలీఫ్ దుకాణాలలోను యితర గ్రామాలలోని దుకాణాలందును పై రేషను స్కేళ్ళు వర్తింప చేయమని ప్రభుత్వము ఉత్తరవు చేసియున్నది.

గోధుమలు గ్రామప్రాంతాలకు ఎక్కువగను రవ పట్టణప్రాంతాలందును సప్లయి చేయుటకు పంపమని జిల్లా కలెక్టరులు కోరబడియున్నారు.

## ధాన్యసేకరణలో అభివృద్ధి

చెన్నపట్నం, నవం. 6: ఈ 30-10-48 వ తేదీతో అంతమైన వారములో చెన్న రాజధానియందు మొత్తం 30701 టన్నుల బియ్యం సేకరింపబడెను. ఈమొత్తం వెనుకటివారం సంఖ్యకంటె 5981 టన్నులు ఎక్కువ. మలబారులో యీవారమున 9392 టన్నులు (వెనుకటి వారంలోకంటె 3807 ట. ఎక్కువ) పశ్చిమగోదావరిలో 3242 టన్నులు (వెనుకటి వారంలో కంటె 819ట) గుంటూరులో 978 టన్నులు (వెనుకటివారంలో కంటె 418 ట. ఎక్కువ) ధాన్యం లభ్యమైయ్యెను.

ఈ వారం నిలవమొత్తం 205046 టన్నులు. ఇంతకుముందువారంలో 195192 టన్నులు నిలవయుండెను.

మదరాసు నగరమున 25 రోజులకు సరిపోవునంత నిలవ 5978 టన్నుల బియ్యము కలదు.

## అంతర్జాతీయ సహకార దినోత్సవం

### మంత్రి శ్రీ చంద్రమౌళిగారి ఉపన్యాసం

సహకారఉద్యమ ప్రాశస్త్య వివరణ

చెన్నపట్నం, నవంబరు 6: సహకారశాఖా మంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు అంతర్జాతీయ సహకారోత్సవ సందర్భమున ఇట్లుపన్యసించిరి:- సహకార సూత్రము ఏ ఒక్కరి సొత్తుకాదనియు, జగత్తు అందరి సొత్తుఅనియు రుజువుచేయుటకు మనమీ అంతర్జాతీయ సహకారోత్సవము జరుపుచున్నాము. జాతీయ అడ్డుల మించి, వివిధ జాతులను, ప్రజలను ఏకరంగమున కలపగల శక్తి సహకార మంత్రము నందున్నది. సహకారము బహురూపముల వికసించవచ్చు. ఋణమునుగాని, వస్తువులను గాని ప్రసాదించవచ్చు వస్తువుల ఉత్పత్తిచెయ్యవచ్చు. పంచవచ్చు. వ్యవహారమునకు సంబంధించవచ్చు. విద్యాభివృద్ధికి సంఘక్షేమమునకు అది విస్తరించవచ్చు. సహకారము అనేక రకములవారికి ఉపకరించవచ్చు. వ్యవసాయదారుల ఆర్థికస్థితి బాగుచెయ్యవచ్చు. పారిశ్రామిక కార్మికులకు, జీతములు పుచ్చుకొను ఉద్యోగులకు, నిరుద్యోగులకు కూడా ప్రయోజనకారి అవవచ్చు. సహకార రంగమేదైనా, సహకార ప్రయోజనమును పొందుటకు ఎవ్వరైనా సహకార సూత్రము సర్వత్రా ఒక్కటే. ప్రతి వ్యక్తీ తనకు తాను సహాయపడి, సర్వులూ సంఘప్రయోజనమునకు తోడ్పడుట దాని ధర్మము. ఒకరిని పలిపెట్టి, మరొకరిని ఆదరించుట దాని తత్వముగాదు. సంఘశ్రేయముతో వ్యక్తిశ్రేయస్సును మేళవించుటయే సహకార అంతరార్థము. స్వసహాయము, పరస్పర సహకారము అను వేదికయే సర్వసహకారవాదులను ఏకోన్ముఖములుగా చేయుచున్నది.

### సింహళ భారత సంబంధాలు

మన్నారు జలసంధి సింహళమును, భారతదేశమును విడదీయుచున్ననూ, ఈ సహకార సూత్రమనుబంధమే ఉభయదేశములకు అనురాగబంధమైనది. సింహళీయులు మన ఉల్లిపాయలను, పసుపును కోరుచున్నారు. మనకు వాటిని విడుదలచేయు మార్కెటు కావలసియున్నది. అచ్చటి వాడుకదారులు, ఇచ్చటి ఉత్పత్తిదారులు ఒకరికొకరు సహాయపడ అంగీకరించినారు. పర్మిట్లద్వారా వ్యాపారము జరుగుచున్నది. దానికి భారత ప్రభుత్వము ఆశీస్సులనిచ్చినది. 500 టన్నుల ఉల్లిపాయలను అప్పుడే దిండిగల్లు సహకారసంఘము పంపినది. తాడ్పత్రి, ప్రొద్దుటూరు సంఘములలో కలసి 1100 టన్నులను పంపనున్నవి. అర్ధలక్షరూపాయల విలువగల పసుపును గోబిచెట్టిపాళెం సంఘం సింహళమునకు పంపినది. బర్మా, మలయా, సింగపూర్ సింహళము దేశములకు, అచటి దిగుమతిదారులలో కొద్దిమాత్రమే సహకారసంఘములు ఉన్ననూ 18 లక్షల రూ.ల విలువగల చేనేతబట్టలు పంపబడినవి. అచ్చటి వాడుకదార్లు సహకారసంఘము లేర్పరచుకొనుటకు ఆత్రపడుచున్నారు. ఇక్కడి రాష్ట్రసంఘము వారికిసహాయపడుటకు తోడ్పడుచున్నది. ఈ రాష్ట్రమందలి సహకార సంస్థలు వివిధ దేశములతో సహకారమును నెలకొల్పుకొని, అంతర్జాతీయ సహకారము ధర్మసూత్రమేగాక ఆచరణ సాధ్యమని చెప్పవలసి ఉన్నది.

## నిమ్న-ఉన్నతజాతులు కలియాలి

మనదేశంలో సహకారోద్యమం అన్ని సంఘాలకు జాతులకు సమిష్టిగా నుండాలి. నిమ్నజాతులకు యింకా ప్రత్యేక సహకార సంఘాలు ఎందుకుండాలో తెలియకున్నది. ఉన్నత జాతులవారు పెద్దవాళ్లు తరగతులవారిని సహకార సంస్థలందు చేరనీయుట లేదనుటకన్న, దిగువ జాతులవారే తమ ప్రత్యేకతనుపోగొట్టుకొనలేకున్నారనుటే మంచిది. నిమ్నోన్నతజాతులవారుభయులు తమ సమిష్టిశ్రేయముకొరకు ఒకే సహకార సంఘంద్వారా ప్రయత్నించాలి.

గ్రామ సహకారసంఘాలు ఒక్క పరపతి సంఘాలుగా మాత్రమే పనిచేయుచున్నవి. వాటి నిర్మాణ నియమాల ప్రకారం అవి సకలార్థసహకార సంఘాలుగాకూడ పనిచేయవచ్చును. ఆహార ధాన్యాలు, వస్త్రాలు, వేరుశనగ పిట్టుగూడ గ్రామస్తులకు యీ సంఘాలు సరఫరా చేసినచో చాలమేలుకల్గును. కంట్రోలు ఉత్తరువులేగాక యితర ఉత్తరువులుగూడ యీ మార్పునకు అవసరమగును. గ్రామ సహకారసంఘాలందు పనిచేయుచున్న సోదరులు, యితరులకు అన్నివిధముల తోడ్పడుటకు పనిచేయాలి.

పరపతి ప్రమాణ నియమము అమలుజరిగినచోట గ్రామ పరపతి సంఘాలు సభ్యుల పంటసరకును చేరువనున్న మార్కెటులకు పంపి సరసమగు ధరలు వచ్చేటట్లు మాస్తున్నాయి. ఇట్టి సంఘాలు 1947-48లో 578 పని చేసినవి. ఈ పనికి ఆహార ధాన్యాల ధర కంట్రోలు చేయుట కొంత ప్రతిబంధకంగా నున్నా పని బాగానే జరిగింది. పరపతి సంఘాల యితర విధములను యిట్టి వ్యాపారం ఎక్కువ చేయుటకు వీలుగా, సంఘ రిజిస్ట్రరుల సంఖ్య పెంచాలని 1947 సెప్టెంబరులో సహకార సభవారు తీర్మానించిరి. ఈ విషయం ప్రభుత్వం వారు శ్రద్ధగా యింకా ఆలోచిస్తున్నారని తెల్పుటకు సంతసమగుచున్నది.

గ్రామాలలో సకలార్థ సహకారసంఘాల స్థాపనకై రిజిస్ట్రారుగారు చేసిన సూచనలను, నియమములను ప్రభుత్వం పరిశీలించుచున్నది. ముందుగా వీనిని దెందులూరు (పశ్చిమ గోదావరి జిల్లా), తిరుమంగళం (మధురజిల్లా), కెంబ్లా (దక్షిణ కన్నడజిల్లా) ఫిర్కాలలో స్థాపించుటకు ప్రభుత్వం నిశ్చయించింది. వీని అనుభవాన్ని పురస్కరించుకొని ప్రజలు ఇదేరీతిగా సకలార్థ సహకార సంఘాలను స్థాపించుటకు యత్నించవలసియున్నారు.

గ్రామాలలో సహకారసంఘాలు పరపతి కార్యాలనేగాక (క్రెడిట్) ఇతర కార్యాల కెట్లుపయోగపడవచ్చునో రాష్ట్రములోని వివిధ కార్యక్రమాలను, (వలస కార్యక్రమములు మొదలైనవి) గమనించినచో గ్రహించవచ్చును. 20 గ్రామ పరపతిసంఘాలు 2768 ఎకరాల బీడుభూమిని సాగుకు తెచ్చినవి. 8 గిడ్డంగులు నిర్మించబడినవి. ఒక సంఘం ఖాదీ నూలు వడకుటకూడ సహకార కార్యక్రమంలోకి తెచ్చినది. 38 సహకారవలససంస్థలు 8725 మందిజనులకు నివాస మేర్పరచినవి. 10082 ఎకరాల బీడుభూమిని సాగులోకి తెచ్చినవి, కొన్ని సహకార సంస్థలు చాపలనేత, గొర్రెలపెంపకం, కోళ్లపెంపకం మొదలైన కార్యక్రమాలను చేకొన్నవి.

సహకార కార్యకమాలు సాధించిన కార్యాలనుబట్టి పెద్దవలస కార్యక్రమం తలపెట్టబడుచున్నది. ఈ సంస్థలో భూమి పట్టాదార్లు, కూలీలుకూడా సభ్యులుగా ఉండగలరు. తిరుచినాపల్లిజిల్లా మరుదూరులో ఇట్టి సంస్థను రిజిస్టరుచేయు విషయమై ప్రభుత్వం ఆలోచించుచున్నది. త్వరలో రాష్ట్రమంతటా ఇట్టిసంస్థలు స్థాపింపబడగలవని ఆశించుచున్నాను. దీనివల్ల ఉత్పత్తి వృద్ధియగుటయే గాక, భూమి యజమానులకు, కూలీలకు మధ్య సహకారం సాధ్యముకాగలదు.

సహకారోద్యమం వ్యక్తి సమష్టి క్షేమములను సాధించగలదని నా దృఢవిశ్వాసం. ఈ సహకార విధానమును గ్రామాలలోనూ, పట్టణాలలోనూ వ్యాప్తిచేయవలెను. దేశమంతటా మాత్రమేగాక, ప్రపంచమంతటా సహకార సూత్రములను ప్రవేశపెట్టుటే సహకారోద్యమకారుల కృషి. దీనికై అంతర్జాతీయ సహకారోద్యమోత్సవంలో సహకారోద్యమకారులు దీక్ష తీసుకొనుచున్నారు.

## స్వదేశానికి నెహ్రూ రాక

1 వ పేజి తరువాయి

శ్రయంవద్ద బొంబాయిరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు యస్. క. పాటిల్, బొంబాయి హోంశాఖామంత్రి మొరార్జీ దేశాయ్, బొంబాయి మేయరు, రాష్ట్రగవర్నర్ ప్రధానాంతరంగిక కార్యదర్శి, పండిట్ నెహ్రూకు స్వాగతం చెప్పిరి.

సరిగ్గా నెలరోజులక్రితం ఈ విమానాశ్రయంనుండే భారత ప్రధానామాత్యుడు బ్రిటిష్ కామన్వెల్తు ప్రధాన మంత్రుల సమావేశంలో పాల్గొను నిమిత్తం లండన్ వెళ్ళియుండెను. ఈ రోజు ఇక్కడ ఉండి రేపుడిల్లీ వెళ్ళవలసిందిగా బొంబాయి ప్రముఖులు నెహ్రూ కైరోలో ఉండగానే కోరినారు. కాని వారు తక్షణం డిల్లీ వెళ్ళిపోవుటకే నిశ్చయించినారు. ఈ ఉదయం 8 గంటలకు తిరిగి విమానంలో డిల్లీ వెళ్ళిపోయిరి. వారివెంట వారి మేనకోడళ్లు రీటా, తారా పండిట్‌లుకూడ వచ్చిరి.

లండనులోనూ, పారిసులోనూ ఒక్క క్షణం అయినా తీరికలేక కార్యక్రమం కొనసాగించుకొని కైరోలో రెండు రోజులు అవిరామ కార్యక్రమమును నిర్వహించుకొని వచ్చినప్పటికిని ప్రధాని నెహ్రూ అమిత ఉత్సాహంగా కన్పించినారు. అలసినట్లెక్కడా కన్పించలేదు. రాత్రి విమానాశ్రయం నుండి ప్రభుత్వభవనమునకు వెళ్లి అచట విశ్రమించిరి. తాను వెళ్ళినందుకు చాల సంతసించితిననీ, తిరిగి వచ్చినందుకు మరింత సంతోషించుచుంటిననీ అన్నారు. వారి కార్యకలాపములను భారతీయులు అత్యంత శ్రద్ధాసక్తులతో గమనించుచుండిరని తెలుపగా వారు సంతృప్తిని సంతోషాన్ని వెల్లడించారు.

భద్రతామండలిలో భారత ప్రభుత్వం తరఫున హైదరాబాద్ వివాదలో వాదించిన సర్ రామస్వామి మొదలియార్ గారు ఈ విమానంలోనే తిరిగి వచ్చిరి.

## యూరప్‌లో నెహ్రూ

లండన్, నవంబర్ 5: ఒక మాసము రోజులుగా యూరపునందు పర్యటన గావించి భారతదేశమునకు తిరిగి వెళ్లిన భారత ప్రధాని, భారతదేశమును దీపకాంతులలోనికి తెచ్చి, ప్రపంచజాతులకు భారతదేశముపట్ల కనువిప్పు గలిగించినాడు.

ఇది కేవలము, కామన్వెల్తు సమావేశమునందు, ఉజ్వల రూపమున ప్రకాశించిన ప్రధానిని చూచి ఒక్కలండనులోని అభిజ్ఞవర్గములవారు తలంచుచున్న మాటయే గాదు — పారిస్‌లోని రాజ్యాంగ నిపుణులు సహితము యిదే అభిప్రాయమును తెల్పుచున్నారు. ఐక్యరాజ్య సమితికి నెహ్రూ అందజేసిన సందేశము రాజకీయవేత్తలను కదల్చినది. ఐక్యరాజ్య సమితిలో అట్టి ఉపన్యాస మొసగుటకు, ఒక్క నెహ్రూ ప్రధానికి మాత్రమే అవకాశ మొసంగబడినది. ఇట్టి ఆచార మెన్నడునూ లేదు.

దీనితో ప్రధాని, పర్యటనా ప్రాముఖ్యము తారాపథమునకు లేచినది.

నెహ్రూ ప్రధాని, లండనులోనూ, పారిస్‌లోనూ — కేవలమూ కామన్వెల్తు నాయకులనేగాక, ఐక్యరాజ్యసమితి సమావేశములందు పాల్గొనుటకు వచ్చి, ప్రపంచ ప్రముఖ రాజకీయవేత్తలలందరితోనూ గూడా సన్నిహితమునకు రాగలిగిరి.

ఇనుమిక్కిలిగా వీర్పరుపబడిన ఆ అనధికార సమావేశములలో, ప్రపంచ సమస్యలన్నిటిమీదనూ, భారతదేశము యొక్క దృక్పథమును, ఈ ప్రపంచ ప్రముఖులందరికి, ముఖాముఖి నచ్చజెప్పియున్నాడు.

యూరపియన్ భావవైరుధ్యములలోనే తలపట్లు పట్టుకొనుచూ తలమునకలగుచున్న ఈ రాజకీయ వేత్తలకు, ఆసియా ఖండమను నదికూడ ఒకటి కలదనీ, దానికి కూడ ప్రపంచ సమస్యలపైన ఒక ప్రత్యేక దృక్పథము కలదనీ, కేవలము ఆసియాకు విడాకు లిచ్చి యూరప్ ప్రముఖులు యెట్టి నిర్ణయములకు వచ్చిననూ వట్టి వ్యర్థప్రయత్నమనీ నెహ్రూ వారికి తెరలించి చెప్పియున్నాడు. దీనివలన ఎంతయో మహోపకారము జరిగినదని పారిస్‌లోని రాజకీయ వర్గము లనుకొనుచున్నారు.

సాంఘిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగములలో తక్కిన ఆసియా దేశములన్నియు, భారతదేశము యొక్క నాయకత్వముకొరకు ఎంత ఆశతో ఎదురుచూచుచున్నవో యూరపియన్ రాజ్యముల కన్నిటికి విస్పష్టముగా తెలిసిపోయినది.

ఆసియా నాయక ప్రముఖులలో నెహ్రూ నెరపిన సంభాషణలు అతి ముఖ్యమైన నూతన దృక్పథ మేర్పడుటకు దారితీసిన వనుకొనుచున్నారు. ద్వితీయ ఆసియా సమావేశమునందు దానికి సమగ్రరూప మొసంగబడునని తలపోయుచున్నారు. ఈ కారణముగా ప్రపంచ రాజ్యముల దృక్కులన్నియు, ఇప్పటినుండియూ ఆ సమావేశ కార్యక్రమముపై కేంద్రీకరింపబడు చున్నవి.

ప్రపంచరాజ్యముల అభిప్రాయములను సమగ్రముగా అరయు చేసుకొనుటకు ప్రధాని, సునిశితముగా ప్రయత్నించి యున్నారు. "ఆయన, బ్రిటన్‌లోని ప్రముఖ రాజకీయవేత్తలందరితోనూ సంభాషించి యున్నారు. అమెరికా, రష్యా, ఫ్రాన్సు మొదలుగాగల అనేక ప్రముఖరాజ్యముల రాజకీయవేత్తలతో సంభాషించియున్నారు. ఇవిగాక సమీప, మధ్య, దూరప్రాచ్యములకు చెందిన షుమారు 20 ప్రముఖ రాజ్యముల ప్రతినిధులతో ముచ్చటించియున్నారు.

ఈ సంభాషణలన్నియూ, అనధికారముగా జరిగిన మైత్రి సంభాషణలే యైననూ, వీనివలన, రాజకీయరంగమున భారతదేశ మాక్రమింప బోవుచున్న ప్రముఖస్థానము స్థాపింపబడుచున్నది.

కామన్వెల్తు మంత్రుల సమావేశము ఆదిలోనే, కామన్వెల్తు దేశములలో భారతదేశ మాక్రమించుచున్న ప్రధానస్థానమును తక్కిన సామంతరాజ్యముల మంత్రులందరు అవగతము చేసుకొనుటకు అవకాశము కలిగినది.

అనధికార సంభాషణలలో కామన్వెల్తుతో సహకారము నెరపుపట్ల భారతదేశముయొక్క అభిప్రాయము వారందరికీ తేల్లముగా తెలిసిపోయినది. సర్వతంత్ర స్వతంత్రమైన 'రిపబ్లిక్'గా ప్రభవించియూకూడ భారతదేశము కామన్వెల్తులో నుండుటకు అవకాశముగల ఒక ప్రణాళికను ప్రధాని భారతదేశమునకు గొనిపోవుచున్నాడు. ఈ విషయమున ఇతర కామన్వెల్తు దేశముల మంత్రుల అభిప్రాయములనుకూడ సేకరించి భారతదేశమునకు గొనిపోవుచున్నాడు.

అర్చింపబడిన విషయములపై ఎట్టి నిర్ణయములు జరుగక పోయిననూ, నెహ్రూ ప్రధానిగాని యితర డొమీనియన్ మంత్రులు గాని వాగ్దానములు చేసియుండక పోయిననూ రేపు రాజ్యాంగనిర్మాణ సభ యీ విషయము తేల్చవలసి వచ్చినప్పుడు ఈ వివరములు చాల ప్రయోజనకరములు కాగలవని ఆశింపబడుచున్నది.

భారతదేశమునకు బయలుదేరు పూర్వము, ప్రధాని నెహ్రూ ఈజిప్టు ప్రధానీ, అరబ్ లీగువారు ఒసంగిన రెండు విందులలోనూ పాల్గొనిరి. అరబ్‌లీగు విందులో నెహ్రూ, లియాకతాలీ ఇద్దరూ కలిసికొని పరస్పరము కరచాలనము చేసుకొనిరి.

ఊపిరి తిరగని కార్యక్రమములో నందియూ ప్రధాని కెయిరో ప్రాంతమందలి ప్రముఖప్రదేశములను తిలకించెను. 'స్ఫినిక్సును' 'పిరమిడ్సు'నూ దర్శించెను. ఆ పరిసరముల చారిత్రక పరిశోధకులు జరుపుచున్న భూగర్భపరిశోధనలు చూచి ప్రధాని సంతోషించిరి.

బొంబాయిలో విశ్రాంతి ముగించుకొని ప్రధాని నెహ్రూ ఈ వుదయం గం. 8 లకు విమానములో ఢిల్లీ వెళ్ళిపోయిరి. మురార్‌జీ దేశాయ్, యస్. క. పాటిల్, మొదలగు ప్రముఖులు ప్రధానికి వీడ్కోలొసంగిరి.

## నెహ్రూకు డాక్టరేట్ గౌరవం

ప్రస్తుత మున్న కార్యక్రమము ప్రకారము డిసెంబరు 29 వ తేదికి నెహ్రూ ప్రధాని బెంగుళూరు వచ్చెదరు. అచ్చట 'అఖిలభారత విమానయాన సంఘము'నకు స్నాతకోత్సవము నెరవేర్చెదరు. 'బెంగుళూర్ ఫ్లయింగ్ క్లబ్' స్నాతకోత్సవముకూడ సల్పెదరు.

డిసెంబర్ 31 వ తేదీ, ఉదయం బెంగుళూరునుంచి మైసూరు వెళ్లెదరు. అచ్చట మైసూరు విశ్వవిద్యాలయమువారొసంగనున్న 'డాక్టరేట్ బిరుదము'ను స్వీకరింతురు. తరువాత జనవరి 1 వ తేదిన బెంగుళూరులోని, అఖిల భారతశాస్త్ర విజ్ఞాన పరిశోధనా కేంద్రమును తిలకింతురు. అచ్చట ఆయన గౌరవార్థ మేర్పాటగుచున్న శాస్త్ర విజ్ఞాన ప్రదర్శనమును తిలకించి ఆ మధ్యాహ్నమే ఢిల్లీ వెళ్లెదరు.

## పశ్చిమ రాజ్యాల అమానుష పథకం

### రేడియంకిరణాల కోటలు

లండన్, నవంబరు 5: బాల్టిక్ సముద్రంమీద ఉన్న స్టెటిన్ పట్టణంనుంచి ఏడ్రియాటిక్ సముద్రంమీద ఉన్న ట్రీస్టీ పట్టణంవరకూ, 80 మైళ్ల వెడల్పుగల భూభాగమంతటిలోనూ ఏజీవజంతువూ బతికి ఉండటానికి వీలు లేకుండా రేడియం కిరణాలతో నింపి ఒక 'రేడియం కిరణాలకోట'ను కట్టటానికి బ్రిటిష్, అమెరికన్ శాస్త్రజ్ఞులు పథకం వేస్తున్నారని 'ఈవెనింగ్ స్టాండర్డ్' పత్రిక పారిస్ విలేఖరి వ్రాస్తున్నాడు. ఈ రేడియం కిరణములు పరమాణు విచ్ఛిత్తివలన ప్రసారం చేయబడుతవి. ఈ ప్రసారం చెయ్యబడిన ప్రాంతంలోని జీవులన్నీ శరీరంపై నుండి రక్తం ప్రవహించగా చనిపోగలవు.

రేడియం కిరణాలను గాలిలో కొంత ఎత్తున వ్యాపింపచేస్తే విమానాలు కూడా అటురాలేవని తెలుస్తున్నది. ఈ విధంగా బ్రిటిష్ రచయిత చిత్రించిన ఊహాదృశ్యాలన్నీ నిజమయ్యేట్లు కనిపిస్తున్నది. అయితే ఈ రేడియం కోటలు కొంతకాలం వానలు కురిస్తే కరిగి పోగలవని తెలుస్తున్నది. కిరణాల ప్రభావం భూమిపై బాగానే ఉంటుంది కనుక భూమి అడుగు నుంచీ, ఇతర విధాలా రాకపోకలు జరిపే అవకాశం ఉంటుంది. (గ్లోబ్)

## ఆర్. ఎస్. ఎస్. పై నిషేధం

### రద్దుచేయకూడదని నాగపూర్ కాంగ్రెస్ శిఫార్సు

నాగపూర్, నవంబరు 5: వచ్చేఏడాది అఖిలభారత జాతీయ కాంగ్రెస్ మహాసభను నాగపూర్‌లో జరుపవలసినదిగా అర్థించుచూ, నాగపూర్ రాష్ట్రకాంగ్రెస్ కార్యవర్గం తీర్మానము చేసెను. ప్రస్తుతం నిషేధం ఉన్నప్పటికి రాష్ట్రీయ స్వయంసేవకసంఘము, దేశములో మతవిద్వేషము, అరాచకమును ప్రచారము చేయుచున్నదని, అందుచేత నిషేధమును రద్దుచేయకూడదని శిఫార్సుచేయుచూ మరియొక తీర్మానము గూడా కార్యవర్గం ఆమోదించెను.

## గుడివాడలో అతివృష్టి

గుడివాడ, నవంబర్ 5: గత 2 దినముల నుంచి యిక్కడ షుమారు 15 దుక్కుల వర్షం కురిసెను. పట్టణమంతా నీటిమయమయింది. పూరిఇండ్లు బాగా దెబ్బతిన్నవి. స్థానిక ఉన్నత పాఠశాల ఆవరణఅంతా నీటిలో మునిగిపోయి, పాఠశాలలోకి నీరు వచ్చుటవల్ల నిన్న, యివ్వాళ సెలవు ఇవ్వబడెను. మురుగునీటి పారుదల సదుపాయములు అంతగా లేకపోవుటవల్ల నీరు నిలచివున్నది. ఇచ్చటి నుండి ఏలూరు పోవు రోడ్డుమీద 4 అంగుళాల ప్రమాణాన బుడమేరు వరద నీరు ప్రవహించుచున్నది. కాని బస్సులు పోవుచునే వున్నవి. ఈ వర్షము పైరులకు చాలా ప్రమాదకరమని, ప్రస్తుతం వున్న తెగుళ్లకు యింకా బలం చేకూరునని అనుచున్నారు.

# రాయలసీమ అభివృద్ధికీ ఆంధ్రరాష్ట్ర సిద్ధికీగల అవినాభావ సంబంధం

## ఎం. కె. వి. రెడ్డిగారి వివరణ: రాయలసీమ మహాజనసభ అధ్యక్షోపన్యాసం

'ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణమువల్లనే రాయలసీమావసరములకు ఎక్కువ ప్రాధాన్యము, బలము ఏర్పడుతుందని మనము గుర్తించి ఆంధ్రరాష్ట్ర తక్షణ నిర్మాణానికీ, దానితోపాటు రాయలసీమావసరముల సంసిద్ధికీకూడా కృషిచెయ్యవలెను. ఈ రెండూ అవినాభావ సంబంధముకలవే కాని పరస్పర విరుద్ధమైనవి కావు' అని శ్రీ ఎం. కె. వి. రెడ్డిగారు నవంబరు 7-వ అనంతపురంలో రాయలసీమ మహాజనసభ కధ్యక్షత వహించిన సందర్భమున ఉపన్యసించుచు నుడివిరి.

శ్రీ రెడ్డిగారిట్లు ఉపన్యసించిరి.

భారత స్వాతంత్ర్యోదయ కాంతిలో జరుగుచున్న ప్రప్రథమ రాయలసీమ మహాసమావేశమిది.

మనకిప్పుడే సిద్ధించిన మన మాతృ స్వాతంత్ర్యాన్ని దేశంలోని ప్రతిఒక్క మానవుడూ అనుభవించునట్లు చెయ్యాలి. అదే మన కార్మిక కర్షక ప్రజారాజ్య నినాదముయొక్క పరమార్థము. దానిని సాధించే బాధ్యత మనమీదనే ఉన్నది. రేపు దేశములో సంపూర్ణ వయోజన వోటింగుపద్ధతి రావడంతో, మన ప్రజాస్వామిక చరిత్రలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమవుతుంది. అట్టి పరిణామమునకు తోడ్పడుటకే యిక ముందు మన రాజకీయసభలూ, వాటి స్థాయి సంఘములు, అవి స్థాపించే సంస్థలూ కృషి చెయ్యాలి.

### మహాసభ ఆశయం

రాయలసీమ మహాజనసభ అంటే యే యితర ప్రాంతీయులమీదనో ఆక్రోశము వెలిబుచ్చే సంరంభము కాదు. నేటి రాజ్యాంగ పరివర్తనములవల్ల సిద్ధించే సర్వసదవకాశములనూ, సాధన సంపత్తినీ రాయలసీమ ప్రజానీకము పొందేటట్లు కృషిచేసే, ఆదర్శముతోనే యీ మహాసమావేశము జరుగుచున్నది.

ఒకవంక రాజ్యాంగ పరిషత్తు సమావేశమై మన రాజ్యాంగ పథకమునూ, వివిధ రాష్ట్ర పునర్విభజనా సిద్ధాంతములనూ నిర్ణయించబోతున్న యీ సమయంలో కాకున్న యింకెప్పుడు మన రాయలసీమావసరముల గూర్చి, ప్రజల కర్తవ్యమును గూర్చి నిర్ణయించుకొనగలమో మీరే యోచించుడు! ఇట్టి ప్రయత్నము మనకు కూడా అడ్డంకులు కల్పించి యిది నీ యితరుల ప్రోద్బలమువల్లనో, రాయలసీమ ప్రజలను పెడదారిలో పెట్టే ఒక కుతంత్రముగా ఖండిస్తూ కరపత్రములను ప్రకటించిన మన సోదరులు యీ మహాసభనే భగ్నమొనర్ప ప్రయత్నించుట కంటే యీ సభారంగముపై నిలచి రాయలసీమయొక్క తక్షణావసరముల సాధించే భవిష్యత్కర్తవ్యమును నిర్ణయించే కార్యకలాపమునకు తాముకు తోడ్పడినచో, రాయలసీమ ప్రజలకు ఎక్కువ ఉపకారమును సేవను చేసియుండెడివారు. కాని ప్రజాభ్యుదయము శ్రీ జగన్నాథ రథమువంటిది. అది ఏ అడ్డంకులనూ సరకుచేయదు. ఎవ్వరికోరకూ ఆగదు. ఆ మహారథోత్సవంలో పాల్గొనుటకు అందరికీ హక్కుకలదు. అట్లే నేడు ప్రారంభమగుచున్న యీ రాయలసీమ మహాజనసభా కార్యకలాపం నిర్వహించుటంలో కూడా అందరూచేరి మన మహోద్యమాన్ని విజయవంతము చేయుదురుగాక అని కోరుచున్నాను. ఏ దేశముయొక్కగాని, ప్రజలయొక్కగాని, భావిభాగ్యములు ఆయా ప్రజల స్వయంశక్తి మీదనే ఆధారపడును. అదే మన గాంధీగురుదేవుని దివ్యసందేశము.

### భాషాప్రయుక్త రాష్ట్రాశయం

అట్టి స్వయంపోషకశక్తినీ, స్వపరిపాలనా పటిమను మన ప్రజానీకం పొందవలెనంటే, అందుకు వయోజన వోటింగు పద్ధతిగలెనే భాషా ప్రయుక్తరాష్ట్రముల నిర్మాణమున్నూ అవసరమని వేరుగా చెప్పనక్కరలేదు. ఆయా ప్రాంతముల పరిపాలన ఆప్రాంతీయులైన ప్రజల వాడుక భాషలో జరిగినంతకాలము సామాన్య ప్రజలు తమ రాజ్యాంగములో తాము ప్రత్యక్షముగా పాల్గొనుటకు అవకాశమే ఉండదు. కావుననే భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణమన్నది. భారత ప్రజారాజ్య స్థాపనముతో సమ్మిళితమైయున్న ఒక మహాసిద్ధాంతము. కావున ఆంధ్రరాష్ట్ర నిర్మాణ తక్షణావశ్యకతను గురించి రెండభిప్రాయము లుండుటకు అవకాశములేదు. అట్టి ప్రయత్నాన్ని మనము ఎంతమాత్రము నిరోధింపకూడదు.

### రాయలసీమ అవసరాలు

ఇక రాయలసీమ తక్షణావసరములూ, అవీ మనకు ప్రధానాంశములే కాని వేరుకావు. ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణమువల్లనే మన రాయలసీమావసరములకు ఎక్కువ ప్రాధాన్యతా, బలమూ ఏర్పడుతుందని మనము గుర్తించి, ఆంధ్రరాష్ట్ర తక్షణ నిర్మాణానికీ, దానితోపాటే రాయలసీమావసరముల సంసిద్ధికీ కూడా కృషి చెయ్యవలె. ఆ రెండూ అవినాభావ సంబంధము గల్గిన జంట సమస్యలే కాని పరస్పర విరుద్ధములైన ప్రతికూలశక్తులు కావు. మన్యప్రాంతములలోని మన ఖనిజములను, ముడిపదార్థములను తమ దేశములకు ఎగుమతిచేయుచు, తమ దేశీయపరిశ్రమలనూ, లాభసాటి వస్తుసముదాయమునూ, మనపై రుద్దుటకును సాధ్యములైన సమద్రతీర ప్రాంతములనే పాశ్చాత్యులు విస్తరింపజేసినారు, వృద్ధిలోనికి తెచ్చినారు. ఇక రాష్ట్రీయ ప్రభుత్వాలూ, మన ప్రజాప్రతినిధులకు సిద్ధించి సరిగా పాతికేండ్లయినను కాలేదు. ఈ పాతికేండ్ల కాలములోనైనను మనకంటే మున్ముందుగా ఉన్నత అధికార స్థానములలోనూ, పదవులలోనూ ఉండి ఎక్కువ అవకాశములను కల్గియుండిన మన ఉత్తర సర్కారుల వారైననేమి, దాక్షిణాత్యులైన నేమి తమ తమ ప్రాదేశికావసరములకే ప్రధానస్థానమిచ్చుచూ, రాయలసీమ అభివృద్ధికి క్షామనివారణమంటూ ఏదో వార్షిక బిచ్చమును పెట్టుట తప్ప, రాయలసీమ ఆర్థిక సౌష్ఠవమును శాశ్వతముగా పెంపొందించుటకై ఎవ్వరూ ఎట్టి ప్రత్యేక శ్రద్ధనూ వహించలేదు. అందువల్లనే మన రాయలసీమలో అసంతృప్తి, ఒక విధమైన నిస్పృహా, యితరుల సదుద్దేశములపట్ల అవిశ్వాసము కలిగినవంటే ఆశ్చర్యమేమీలేదు.

### అభివృద్ధికి మార్గం

ఎన్నాళ్లుగానో ఆందోళన చెయ్యగా చెయ్యగా, తుంగభద్ర ప్రాజెక్టునిర్మాణం ఎంతోకష్టముమీద అంగీకృతమై కార్యరూపం దాల్చినను, పనిమాత్రము జరుగవలసినంత సత్వరముగానూ, సక్రమముగానూ జరుగుటలేదు. హైదరాబాదు సమస్యకూడా పరిష్కారమైనది. కనుక ఇకముందు యిటు తుంగభద్రా జలముల గురించిగాని—అటు కృష్ణా పెన్నారు ప్రాజెక్టుతో సంబంధించిన కృష్ణా జలముల గురించిగాని, రామపాదసాగరమునకు సంబంధించిన గోదావరి విషయంలో గాని మరెట్టి పరస్పర విభిన్న భావములకూ తావుండ వీలులేదు. కావున తుంగభద్రా, కృష్ణా పెన్నారు ప్రాజెక్టుల సత్వర నిర్మాణము మీదనే మన ప్రభుత్వాలు తమ దృష్టిని సంపూర్ణముగా నిలపవలెను. అట్లు చేయించే కర్తవ్యము మన రాయలసీమ ప్రతినిధులైన శాసనసభ్యులపైననే హెచ్చుగా కలదు. కాని తుంగభద్రా ప్రాజెక్టు మన రాయలసీమయొక్క సర్వాంగసరములను, ఆర్థిక సౌష్ఠవమునూ తీర్చే ఏకైక తరుణోపాయము కాదు. స్వతంత్ర భారతంలో రాయలసీమ తన యథోచితస్థానమును పొందవలెనంటే రాయలసీమ సర్వసాధన సంపత్తిని యినుమడింపజేసే ఆర్థిక విధానమూ, ప్రణాళికలూ కావలెను. దేశముయొక్క సమిష్టి ఖనిజసంపత్తికీ, మహాపరిశ్రమలకూ అధినాథులైన భారతప్రభుత్వంవారి సహాయముతో, రాష్ట్రీయ ప్రభుత్వం సాగించవలసిన ఒక పెద్ద కృషి యిది. తూర్పు పంజాబు ప్రాంతమును రుధిరపాతమునుండి కాపాడి, పునరుజ్జీవింపజేయుటకు ప్రత్యేక చట్టమూ చేశాం. ఏ విధముగా ఒక పురోభివృద్ధి పథకమును ప్రత్యేక ఆర్థిక మహాసంస్థను ఏర్పరచినారో అదే పద్ధతిని రాయలసీమయొక్క ఆర్థిక విధానాన్ని సరిదిద్దెటందుకు అటు కేంద్రప్రభుత్వముమీదనూ, యిటు రాష్ట్ర ప్రభుత్వము మీదనూ, ఒత్తిడి తెచ్చే బాధ్యత శాసన సభ్యులైన మన ప్రతినిధుల మీద ఉన్నది. గవర్నమెంటు పూనుకొని నిర్వహించని అవసర విషయములనుగూర్చి ప్రజాప్రతినిధులే ఏకకంఠముతో అనధికార తీర్మానముల రూపముగానూ చట్టములుగానూ ఏల ప్రవేశపెట్టరాదో నాకు తెలియుటలేదు.

### 'రాష్ట్రప్రభుత్వ అలసత్వం'

ఈనాటి మద్రాసు ప్రభుత్వము, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి స్థానముల అభివృద్ధివంటి సామాన్య కార్యక్రమములలోనూ, ప్రస్తుతావసరములైనవైనను యిరిగేషను స్కీములను మంజూరుచేసే విషయములోనూ కూడా రాయలసీమ అవసరముల విషయములో చూపుచున్న అలసభావ మింతింతకాదు. వనకటి ప్రభుత్వము రోజులలో అంచనా లెక్కలు వేయబడి సర్వసంసిద్ధము చేయబడిన తాడిపత్రి థెర్మల్ స్టేషను నిర్మాణమువంటి స్వల్ప విషయాలలో కూడా రాయలసీమ అవసరములు వెనుకకు నెట్టివేయబడుచుండుట వల్లనే రాయలసీమ ప్రజలలో, భవిష్యత్తునుగూర్చి అలజడికల్గి "రేపు ఆంధ్రరాష్ట్రము సిద్ధించినా మన పని యింతేకాబోలు" అనే అపోహకు సహజముగా కారణమౌతోంది. కనుకనే భవిష్యదాంధ్ర రాష్ట్రములో రాయలసీమ స్థానమూ, హక్కులూ శ్రీబాగ్ ఒడంబడిక పద్ధతులమీద యిప్పుడే చట్టరూపంగా నిర్వచించబడవలెనన్న భావం సర్వత్ర వ్యాపించి యున్నది. ఒకనాడు శ్రీబాగ్ ఒడంబడిక రూపంగా ఎన్నెన్నో హామీలనిచ్చియుండిన రాష్ట్రనాయకులీనాడు దానిని ఎంతమాత్రము నిరసించకూడదు. నిరసించరనే నా విశ్వాసము. కాని ఆనాటి శ్రీబాగ్ ఒడంబడికను ఉన్నదున్నట్టుగా రేపటి ఆంధ్రరాష్ట్ర నిర్మాణ చట్టములో అంతర్భూతం చెయ్యవలెను. అట్లు చెయ్యనంతకాలం ఆంధ్రరాష్ట్రనిర్మాణాన్నే నిరోధించాలనే కలలుకెట్టుకుంటూ వాలాయబల్యం ఆంధ్రరాష్ట్ర నిర్మాణమాత్రమును అంగీకరింపచేయుటకే విశ్వప్రయత్నములు చేయవలసి వస్తున్నప్పుడు భారత రాజ్యాంగ చట్టంలో రాయలసీమ ప్రత్యేక ప్రాతినిధ్యాది వివరములన్నీ అంతర్భూతం చేయించటమనేది ఒక్క మన నాయకులచేతిలో నున్న పనికాదు.

అసలు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకే పేయి అడ్డంకులు కల్పింపబడుచున్న యీ సమయంలో మనంకూడా దాని సరకట్టినవార మవకుండా, రాయలసీమ అవసరములను గురించీ, హక్కులను గురించీ ఆంధ్రరాష్ట్ర నాయకులతోనే ఒక సునిశ్చితమైన సమాధానమునకు రావలెను. అట్టి ప్రయత్నానికి మన నేటి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులైన రంగాగారును, సమాజ నాయకులైన ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారును సర్వదా సంసిద్ధులైయే యున్నారు. అసలైన భాషాప్రయుక్త రాష్ట్రసిద్ధాంతానికి ఆనాటి శ్రీబాగ్ ఒడంబడికకు కూడా మూలపురుషులైన శ్రీ డాక్టరు పట్టాభి సీతారామయ్య పంతులుగారే యిప్పుడు రాష్ట్రపతిగా ఎన్నుకోబడి యుండుట కూడా మనకొక మహదవకాశము. కావున పై నాయకత్రయముతో ముఖాముఖి సంప్రదించి రాయలసీమ హక్కు స్వత్వముల విషయమై ఒక సునిశ్చితమైన సమాధానమునకు వచ్చి, ఆంధ్రరాష్ట్ర సంసిద్ధికై కృషిచేయడమే మన కర్తవ్యము. అందుకు వెంటనే ఒక ప్రతినిధివర్గాన్ని డిల్లీకిపంపి సంప్రదింపులను జరిపే విషయంకూడా యీ మహాజనసభ యోచించి నిర్ణయించవలెను.

ఇట్టి కార్యకలాపమంతా వెంటనే జరుగుటకు, సంవత్సరము పొడుగునా రాయలసీమ అభ్యుదయముకొరకు పాటు పడుటకు, యీ మన మహాజనసభను ఒక సుస్థిరమైన మహాసంస్థగా రిజిస్టరుచేసి సమర్థతతో నిర్వహించవలెను. మన రాయలసీమయొక్క భవిష్యత్పరిణామముల కిది ఎంతో అవసరం. ఇందుకు విద్యావంతులును ఉత్సాహపూరితులును అయిన మన విద్యార్థి బృందం కార్మిక బృందం ప్రజానీకంలో తీవ్రంగా కృషిచెయ్యవలెను.

# రజాకార్ అనుమానితుల విడుదల

## ప్రభుత్వ ప్రకటన

హైదరాబాదు, నవంబరు 5: రజాకార్ చర్యలు జరిపినారను అనుమానం మీద ఖైదుచేయబడిన వారందరును, ఏవిధమైన నేరంచేయలేదని నిర్ధారణచేయబడిన ఖైదీలును విడుదల చేయబడ గలరని నేటి రాత్రి అధికారపూర్వకంగా ఒక ప్రకటన చేయబడెను. ఈ విషయమునుగురించి హైదరాబాద్ మిలిటరీ గవర్నరు, మేజర్ జనరల్ చౌధరీగారు జిల్లాలలోని సివిల్ పరిపాలనాధికారులకు ఉత్తరవులుపంపిరి.

మిలిటరీ ప్రభుత్వవిధానం, నేరంచేసినారని అనుమానింపబడినవారిని కాక, నిర్ధారణచేయబడినవారిని శిక్షించుటయేనని చౌధరీగారు చెప్పిరి. కాబట్టి జిల్లాలలోని సివిల్ ఉద్యోగులు రజాకార్ ఖైదీలపై పెట్టబడిన చార్జీలను విచారించి, నేరం నిర్ధారణ కానివారినందరిని విడుదలచేయవలసిందని చౌధరీగారు ఉత్తరువుచేసిరి.

# చెరకుఉత్పత్తిలో ఆధునిక పద్ధతులు

ఉదకమండలం, నవంబరు 5: చెరకు ఉత్పత్తిలో ఆధునిక పద్ధతులు తెలిసికొని వచ్చి, లక్నోలోని చెరకు టెక్నాలజికల్ ఇన్‌స్టిట్యూటులో వానిని అమలు చేయుటకుగాను, ఇన్‌స్టిట్యూటుకు డైరెక్టరుగా నున్న ఎస్. ఎ. రాయ్‌గారినీ, మాజీ చెరకు ప్రవీణుడు టి. ఎస్. వెంకటరామన్ గారినీ భారత కేంద్ర చెరకు సంఘమువారు ప్రపంచమందలి ముఖ్య చెరకు ఉత్పత్తి ప్రాంతములకు పంపుచున్నారు.

# ఇజ్రాయిల్‌కు రష్యా రహస్య సహాయం

పారిస్, నవంబరు 5: రష్యానుండి చెకొస్లొవాకియామీదుగా ఇజ్రాయిల్‌కు ఆయుధ సామగ్రి, మందుగుండు సామాను, విమానములు, రహస్యముగా చేరవేయబడుచున్నవని బ్రిటన్ అమెరికాల గూఢచారులద్వారా విశ్వసనీయముగా తెలియవచ్చినది.

ఇజ్రాయిల్ సైన్యమునుంచి పారిపోయి వచ్చిన కొంతమంది వైమానికులు ఈ విషయమును తమకు మొదట బైటపెట్టిరని, డా॥ రాల్ఫ్ బంచ్‌కు వారిచేత ఈ కుట్ర గురించి వాఙ్మూలములనుకూడా ఇప్పించితిమనీ, ఇద్దరు అమెరికన్ పత్రికావిలేఖరులు ప్రకటించిరి.

ఈ రహస్య రవాణా విషయమై వివిధ వర్గములనుండి ఈక్రింది వివరములు తెలియవచ్చినవి:-ఒకటి, జెకోస్లోవాకియా లోని కొలెక్జ్ విమానాశ్రయమునుండి ఇజ్రాయిల్‌కు అనేక మాసములుగా ఆయుధములు, విమానములు రహస్యముగా చేరవేయబడుచున్నవి. ఇజ్రాయిల్‌కు రహస్యముగా చేరవేయబడిన విమానదళములలో బ్రిటిష్ అమెరికన్ పోరాట విమానములు అనేకం ఉన్నవి. ఈ విమానములు ఎంతమంది చేతిలోమారి చివరకు చుట్టుతో వన ఇజ్రాయిల్ చేరుకున్నవి ఈ రహస్య వ్యాపారంలో ఇజ్రాయిల్‌కు రష్యా మద్దతు సంపూర్ణంగా ఉన్నది.

రెండు, 8 వందలమందికిపైగా రష్యన్ ఆఫీసర్లు ఇజ్రాయిల్ సైన్యములలో పని చేయుచున్నారు. మూడు, ద్రవ్యార్జన చేయడమే ప్రధానకార్యంగా పెట్టుకొన్న కొంతమంది సాహసవంతులైన వైమానికులను ముఖ్యంగా అమెరికన్లను ఇజ్రాయిల్ ఈ రహస్య రవాణాకు వినియోగించుచున్నది. దాదాపు 200 మంది వైమానికులను ఈ దొంగ వ్యాపారంలో ఉపయోగించుకోడం అవుతున్నది. యుద్ధవిరమణ ఉత్తర్వుకు విరుద్ధంగా ఇజ్రాయిల్ విదేశాలనుండి ఆయుధ సామగ్రిని తెప్పించుకొనుచున్నారని బ్రిటిష్ ప్రతినిధి వర్గం కొంతకాలంక్రిందట డా॥ బంచ్‌కి ఫిర్యాదు చేసింది. మరికొన్ని దేశాలుకూడా ఈ ఫిర్యాదును ధ్రువపరిచినట్లు తెలుస్తున్నది. తనకువచ్చిన ఫిర్యాదులను భద్రతామండలి ఎదుటపెట్టడం మినహా తాత్కాలిక మధ్యవర్తిచేయగలిగింది ఏమీలేదు. అయితే బంచ్ మండలిదాకా ఈ ఫిర్యాదును తీసుకొనివెళ్ళను. తీసుకొనివెళ్తే ఎప్పుడు తీసుకొనివెళ్ళను అన్నది ఇంకా నిర్ధారణ కాలేదు.

పాలస్తీనా పరిస్థితి నానాటికీ విషమించిపోతున్నదనీ, ఏనిముషానైనా యుద్ధం తిరిగి ప్రజ్వలించవచ్చుననీ, విదేశాలు కొన్ని పాలస్తీనాలో రహస్యంగా ప్రవేశం కల్పించుకోడమే దీనికి కారణమనీ, ఇటీవల బంచ్ అన్నమాటలు రష్యాను మనస్సులో పెట్టుకొని అన్నవేనని విజ్ఞులు చెబుతున్నారు.

# గాజాకు అరబ్ సైన్యముల ఉపసంహరణ

టెలవీవ్, నవంబర్ 5: దక్షిణరంగంలో మజ్దాల్‌నద్దనున్న ఈజిప్షియన్ సైన్యములు పాలస్తీనా అరబ్ ప్రభుత్వ పీఠమైన గాజాకు ఉపసంహరించుకొన్నదని ఇజ్రాయిల్ సైన్యం ప్రకటించినది.

# అమెరికా రష్యా ప్రతినిధి ఆరోపణలు

(1-వ పేజీ తరువాయి)

కక్యరాజ్య సమితిచే నియమింపబడెను. ఈ బాల్కను వ్యవహారకమిటీ తన నివేదికను సమర్పించెను. గ్రీసులో తిరుగుబాటు చేయుచున్నటువంటి గొరిల్లాసేవలకు అనగా మార్కోస్ నాయకత్వము క్రిందనున్న విప్లవకారులకు గ్రీసు పరిహద్దులలోనున్న యుగోస్లావియా, ఆల్బేనియా, బల్గేరియా రాజ్యాలవారు సహాయము చేయుచున్నారనియు ఆ రాజ్యాలు సహాయముచేయుచున్నంతవరకు బాల్కను రాజ్యములలో శాంతి ఏర్పడదనియు ఆ కమిటీ నివేదికలో వ్రాయబడెను. ఆ నివేదికను గూర్చి ఐక్యరాజ్య సమితియొక్క రాజకీయ వ్యవహార కమిటీయందు చర్చ జరుగుచున్నది. ఈ చర్చ సందర్భములో యుగోస్లోవియా ప్రతినిధియగు డా॥ వీల్బా బెబ్లరు ఉపన్యసించుచు ఇట్లు చెప్పెను. బాల్కను వ్యవహారకమిటీ కేవలము అమెరికాయున్నూ ఇంగ్లాండున్నూ కలిసి తమ మాటప్రకారము ప్రవర్తించే తమ ఏజంటువలె నియమించెను. కనుక ఆ కమిటీ నిష్పాక్షికమైనదికాదు. అట్టికమిటీ నివేదిక నిరర్థకమైనది. కావున యీ బాల్కనుకమిటీ నివేదికను గర్హించి నిరాకరించవలెనను తీర్మానమును నేను ప్రతిపాదించుచున్నాను.

కాని ఆస్ట్రేలియా ప్రతినిధి మరొక తీర్మానమును ప్రతిపాదించెను. గ్రీసు యుగోస్లావియా, బల్గేరియా, ఆల్బేనియా ప్రతినిధులు కలిసి ప్యారిసులో సమావేశమై ఒక సమాధానపద్ధతికి వచ్చుటకై ప్రయత్నించవలెనని ఆ తీర్మానములో కోరబడెను.

రాజకీయ వ్యవహారకమిటీ తిరిగి సోమవారం సమావేశమగుటకు వాయిదా వేయబడెను.

# చైనా అంతర్యుద్ధంలో విషమ దశ

(1-వ పేజీ తరువాయి)

వాకలను పంపి వెంచుచున్నారని అమెరికన్ నావికాధికారులు కొందరు ప్రకటించిరి. కియాంగ్సు, అనహ్వీ రాష్ట్రాలలోని అమెరికనులు ఎంతో అవసరమైతే తప్ప వెంటనే ఖాళీ చేయవలెనని అమెరికన్ అధికారులు ఇటీవల తీవ్రంగా హెచ్చరించిరి.

"ప్రధాన చైనా స్థావరాలకు చేరుకోగలరా" అని కొందరడుగగా "అవసరమైతే కారుణ్య భావముతో అట్లు చేయవచ్చును" అని అమెరికన్ అధికారులన్నారు.

క్వాంటుంగ్ రాష్ట్రానికి దిగువకొనన ఉన్న హాయినాన్ ద్వీపము నుంచి దక్షిణచైనాపైకి కమ్యూనిస్టులు యుద్ధసన్నద్ధులై బహుశా కాలంఘింప వచ్చునని, ఉత్తరాన యాంగ్సీనదిని దాటిరాగానే కమ్యూనిస్టులు ఉత్తరదక్షిణాలు, రెంటి నుంచీ దక్షిణచైనాను ముట్టడించ వచ్చునని అభిజ్ఞవర్గాలు ఊహించుచున్నవి.

## చైనా మంత్రివర్గపు రాజీనామా ఉపసంహారం

చైనా మంత్రివర్గం రాజీనామా నిచ్చిన కారణంగా ఏర్పడిన ప్రతిష్ఠంభనము అంతమైనదనీ, చాంగ్‌కైషేక్ కోరికపై ప్రధాని వాంగ్‌వెన్‌హావ్ గతరాత్రి తన రాజీనామాను ఉపసంహరించుకున్నాడనీ, ఇతర మంత్రులలో ఒక్క ఆర్థిక మంత్రి వాంగ్ యున్ వు తప్ప మిగతా వారంతా తిరిగి మంత్రివర్గంలోనే ఉంటారనీ తెలియుచున్నది. ఆర్థిక మంత్రి పదవికి ఆడిటర్ జనరల్ మంత్రి హ్సూకాన్ నియమింపబడునని తెలియుచున్నది.

## కమ్యూనిస్టులతో రాజీ పడవలసిందని చైనా ప్రొఫెసర్ల మహజర్నామా

నాన్‌కింగ్, నవంబరు 5: జీవన్మరణావస్థలోనున్న చైనాను రక్షించుటకై కమ్యూనిస్టులతో రాజీచేసుకొని సామ్యవాద ప్రజాస్వామ్య సూత్రములమీద దేశములో సంకీర్ణ ప్రభుత్వమును నెలకొల్పవలసిందని విజ్ఞప్తి చేయుచూ, నాంకింగ్ ప్రొఫెసర్లు జనరలిస్సిమో చాంగ్‌కైషేక్‌కు ఒక మహజర్నామాను దాఖలు చేసుకోనున్నారు.

ఈ మహజర్నామా మీద ఇప్పటికిప్పుడే 120 మంది ప్రొఫెసర్లు సంతకం చేసిరి. జాతీయపక్ష శాసనసభా సభ్యుడు అయిన లియాపుటింగ్ ఈ ప్రతిపాదనకు మూలకారకుడు. మహజర్నామా చాంగ్‌కైషేక్‌కు శనివారంనాడు సమర్పించబడును. కమ్యూనిస్టు నాయకుడైన మావోత్సేటుంగ్‌కు కూడా పత్రికా విలేఖరుల ద్వారా ఈ విజ్ఞాపనపత్రం అందజేయబడునని తెలియుచున్నది. శాంతి ఉద్యమమును దేశమంతటా లేవదీయడానికి తాను నడుము కట్టుకున్నానని లియాయి పుటింగ్ చెప్పెను.

## చాంగ్‌కైషేకు రాజీనామా యివ్వాలి

చైనా అగ్రనాయకుడైన చాంగ్‌కైషేకు తన పదవికి వెంటనే రాజీనామానిచ్చి తొలగిపోవలెనని చైనా డెమోక్రాటిక్ కాన్‌స్టిట్యూషనలిస్టుపార్టీ కోరినది. ముక్డెను నగరమును శత్రువులకు చేజిక్కనివ్వటయున్ను, చైనాలోని ద్రవ్య చలామణీని నిగ్రహించలేక పోవుటయును చాంగ్‌కైషేకు చేసిన తప్పిదములని యీ పార్టీ నేరారోపణ చేయుచున్నది. పైచెప్పిన చైనీస్ డెమోక్రాటిక్ పార్టీ యొక్క కార్యాలయము అమెరికాలో సాన్‌ఫ్రాన్సిస్కో నగరమందున్నది. చైనామంత్రివర్గముపార్టీ ఆక్టింగ్ ప్రెసిడెంటు సుదాయిమింగ్ లీగారు చాంగ్‌కైషేకుకు తంతివార్త పంపిరి. చాంగ్‌కైషేకుయెడల అసంతృప్తి ప్రబలముచున్నదనియు చాంగ్‌కైషేకు రాజీనామా యివ్వక కాలహరణంచేసినయెడల ఫలితవ్యవసానములు మరింత దారుణము కాగలవనియు ఆ తంతివార్తలో తెలియజేయబడెను.

న్యూఢిల్లీ, నవంబరు 5: రైల్వే పరివారి సంఘము కోరిన కోర్కెలకు ప్రభుత్వమిచ్చిన సమాధానమును చర్చించుటకు రైల్వేసంఘము కార్యనిర్వాహకవర్గమువారు 23, 24 తేదీలలో నాగపూరులో సమావేశము కానున్నారని ప్రధాన కార్యదర్శి తెలిపెను.

# హైదరాబాదు సంస్థానబ్యాంకు నుండి ఇండియానాణెముల విడుదల

## కరాచీ బ్రాంచి మూసివేయబడు సూచన

హైదరాబాద్, నవంబర్ 5: హైదరాబాద్ సంస్థానబ్యాంకు యికనుండి ప్రజలకు ఇండియా కరెన్సీ, నాణెములను ధారాళంగా యివ్వగలదని సంస్థాన బ్యాంకు ప్రతినిధి ఒకడు నేడు చెప్పెను.

సంస్థానంలో ఇండియా కరెన్సీ, నాణెముల చలామణిపై వెనుకటి ప్రభుత్వం అమలు జరిపిన నిర్బంధములను మిలిటరీ ప్రభుత్వం తొలగించిన ఫలితంగా సంస్థాన బ్యాంకు యిట్లు వ్యవహరించుటకు అవకాశం ఏర్పడినది. ఇండియా కరెన్సీ నాణెముల యిచ్చు విషయమై 4 మాసాల క్రిందట సంస్థాన బ్యాంకు ప్రవేశపెట్టిన పర్మిట్ల పద్ధతి రద్దు చేయబడినది. పర్మిట్ల పద్ధతి సాగించుటకు ప్రవేశపెట్టబడిన ప్రత్యేక ఉద్యోగములు కూడా రద్దుచేయబడుచున్నవి.

సంస్థానంలోని కరెన్సీ నిర్బంధములను తొలగించినందువలన వ్యాపారవర్గములు ఉత్సాహము చూపుచున్నవి. స్తంభింపజేయబడిన ప్రత్యేక వ్యక్తుల ఖాతాల ద్వారా గత ప్రభుత్వంతో సన్నిహిత సంబంధం ఉన్న వ్యక్తుల ఖాతాలు మినహాగా, ఆ ఖాతాలు స్తంభింపజేయబడుటకు పూర్వం మాదిరిగా లావాదేవీలు యిప్పుడు జరుపుకొనవచ్చునని తెలియుచున్నది.

సంస్థానంలోని ఇతర బ్యాంకులలో ఇండియా, హైదరాబాద్ కరెన్సీ నాణెముల మారకం ధారాళంగా జరుగుట లేదని చెప్పవచ్చును. ఆ బ్యాంకులు ఈ విషయమై ఇండియా ఇంపీరియల్ బ్యాంకు, హైదరాబాద్ సంస్థాన బ్యాంకుల మధ్య ఏజెన్సీ ఏర్పాట్లు పునరుద్ధరింపబడునవరకు వేచియుండవలెనని తెలియుచున్నది.

హైదరాబాదులోని ఇంపీరియల్ బ్యాంకు ఖజానా, సికిందరాబాద్‌లోని భారత ప్రభుత్వ ఖజానా తిరిగి యథాప్రకారంగా పనిచేయుచున్నవి.

హైదరాబాద్ సంస్థానబ్యాంకు, కరాచీలో నున్న తన బ్రాంచిని మూసివేయు విషయమై ఆలోచించుచున్నదని తెలియుచున్నది.

## వస్తువుల ఎగుమతిపై నిర్బంధం తొలగింపు

హైదరాబాద్ సంస్థానమునుండి ఎగుమతి చేయబడు వస్తువులను హైదరాబాద్ సంస్థాన బ్యాంకుద్వారానే పంపవలెనని అమలు జరుపబడిన నిర్బంధం తొలగింపబడెను. ఈ విషయాన్ని వర్తకులకు తెలియజేయుచు ప్రభుత్వం ఒక ప్రకటన చేసెను.

"వర్తకులు యికనుండి తమ వస్తువులను, తమ పేరుతోగాని, తమ ప్రతినిధుల పేరుతోగాని, ఏజెంట్లపేరుతోగాని ఎగుమతి చేసుకొనవచ్చును. అయితే వారు హైదరాబాద్ సంస్థాన బ్యాంకులో సర్‌ఛార్జీ రుసుమును చెల్లించి ఆ చలానా యొక్క ఒక ప్రతిని రైల్వేస్టేషనువద్ద, పోస్టాఫీసు ప్రతిని కస్టమ్సువద్ద, మూడవప్రతిని నరఫరా కార్యాలయంవద్ద చూపించవలెను. సర్‌ఛార్జీరుసుము వసూలు చేయు బ్యాంకుల పట్టికనుండి నాగ్‌పూర్ బ్యాంకు పేరు తొలగించబడినది. కాబట్టి వర్తకులెవ్వరు సర్‌ఛార్జీ రుసుమును ఆ బ్యాంకులో జమకట్టరాదు." అని ఆ ప్రకటనలో తెలియజేయబడెను.

## మిలిటరీ గవర్నరు పర్యటన

హైదరాబాద్ మిలిటరీగవర్నరు మేజర్ జనరల్ చౌధరీగారు బీదర్, గుల్బర్గా, రాయచూర్, మహబూబ్‌నగర్ జిల్లాలలో పర్యటించిన పిదప నేటిరాత్రి తిరిగి సికందరాబాదు వచ్చిరి. చౌధరీగారు సూమూలు రైలుపెట్టెనే ఉపయోగించినారు కాని, నిజాం నవాబు ప్రత్యేక రైలును ఉపయోగించలేదు. ప్రతిచోటా ప్రజలు మిలిటరీ గవర్నరుకు ఘనముగా స్వాగతమిచ్చిరి. పర్యటన సందర్భంలో చౌధరీగారికి దాదాపు 15 సన్మాన పత్రములు సమర్పించబడెను. వారొయిచ్చిన పేట ప్రజలు చౌధరీగారికి ఒక రజిత ఖడ్గమును బహూకరించిరి. చౌధరీగారు ప్రజలతో చనువుగా మాట్లాడి వారి కష్టసుఖములను తెలుసుకొనిరి. జిల్లాలలో పరిస్థితులు తృప్తికరంగా నున్నవని వారు భావించిరి. మిలిటరీ గవర్నరు నవంబరు 13 సంప్తాహంలోని మరికొన్ని జిల్లాలలో పర్యటన చేయుదురు.

మిలిటరీ గవర్నరు చౌధరీగారు తమ పర్యటనసందర్భంలో ఏర్పాటుచేయబడిన సభలలో మిలిటరీప్రభుత్వ విధానమును వివరించుచు, తాను యిక్కడకు పంపబడినది సంస్థానప్రజల భవిష్యత్తును నిర్ణయించుటకు కాదని చెప్పెను. "శాంతి భద్రతల పునరుద్ధరించుటకే నేను యిక్కడకు పంపబడినది, ప్రశాంతపరిస్థితులు ఏర్పడిన పిమ్మట తమ భవిష్యత్తును నిర్ణయించుకొనవలసినవారు ప్రజలే. మిలిటరీ ప్రభుత్వమునకు మత పక్షపాతం గాని, రాజకీయ పక్షపాతం గాని లేదు. అందరినీ సమానదృష్టితో వ్యవహరించును. ఎవరైతే శాంతిభద్రతల పునరుద్ధరణ విషయంలో సహకరించిరో వారిని స్నేహితులుగానూ, వ్యతిరేకించినవారిని శత్రువులుగాను మిలిటరీ ప్రభుత్వం పరిగణించుచున్నది. శాంతి భద్రతల పునరుద్ధరణ విషయంలో మాతో సహకరించకుండా మా ప్రయత్నములకు విఘ్నం కలిగించువారిపట్ల కఠినంగా ప్రవర్తించెదము. సంస్థానంలో రజాకార్లు నిర్మూలించ బడినారు. ఇక ప్రజలు ఎవ్వరికీ భయపడనవసరంలేదు. ముస్లిములు, హిందువులు గతమును విస్మరించి సఖ్యతతో ప్రవర్తించ వలెనని కోరుచున్నాను." అని చౌధరీగారు చెప్పిరి.

## చౌధరీ ప్రకటన

హైదరాబాద్ మిలిటరీ గవర్నరు చౌధరీగారు యిచ్చట ప్రెస్ క్లబ్ అధికారులతో ప్రసంగించుచు, తాను పోలీసు నూతన కార్యభారమును స్వీకరించుటకుగాను ఈ సెలవుతీసుకొనిగా సంస్థానమును విడిచిపోవుచున్నానన్న వదంతులు నిరాధారమైనవని చెప్పిరి.

తాను జిల్లాలలో పర్యటించునప్పుడు నిజాం నవాబు ప్రత్యేకరైలును ఉపయోగించుచున్నాడన్న వార్తలుకూడ సత్యదూరములని చౌధరీగారు చెప్పిరి. చౌధరీగారు రాయచూరు, మహబూబ్‌నగర్, గుల్బర్గా, బీదర్ జిల్లాలలో రైలులో పర్యటించినప్పుడు సాధారణ రైలుపెట్టెనే ఉపయోగించిరి.

# ప్రజాపోరాటంలోపాల్గొనని కాంగ్రెస్‌వాదులు

## సంస్థాన కాంగ్రెస్ కార్యదర్శి ప్రకటన

హైదరాబాద్ సంస్థాన కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి నేడు ఒక ప్రకటన చేయుచు, సంస్థాన ప్రజాపోరాటంలో పాల్గొనని కాంగ్రెస్ ప్రతినిధులు ఒక సంవత్సరంవరకు ఏ పదవిలోను ఉండరాదని కాంగ్రెస్ కార్యవర్గం యిటీవల చేసిన తీర్మానమును, సమర్థించెను. ఈ తీర్మానం ఒక ముఖ్యతాము బలపరచుటకు వేసిన పథకమున్న విషయమును ఖండించుచు, సంస్థానకాంగ్రెస్‌ను బలవంతమైన సంస్థగా తీర్చిదిద్దుటకు యీ చర్య అవసరమని ఆ ప్రకటన తెలియజేసెను.

సంస్థానకాంగ్రెస్ నిర్వహింపవలసిన గురుతర కార్యభారమును వివరించుచు యీ కార్యభారమును సక్రమంగా నిర్వహించుటకు సంస్థాన కాంగ్రెస్ సుశిక్షితమైన, బలమయిన సంస్థగా నుండుట అవసరమని ఆ ప్రకటనలో తెలియజేయబడెను. "అందుచే సంస్థాన కాంగ్రెస్‌లో యిటువంటి సభ్యులు లేకుండా చేయవలసిన అవసరం ఏర్పడినది. ఈ దృష్టితో కాంగ్రెస్ కార్యవర్గం యిటీవల చేసిన తీర్మానములను పరిశీలించవలెను. కార్యవర్గంచేసిన యీ తీర్మానం 15 వందల మంది కాంగ్రెస్ ప్రతినిధులలో 500 మందికి వర్తించగలదు" అని ఆ ప్రకటనలో తెలియజేయబడెను.

# గాంధీ స్మారకనిధి

హైదరాబాద్ మహాత్మాగాంధీ స్మారకనిధికిగాను అక్టోబరు 31 వరకు సేకరింపబడిన విరాళములమొత్తం లక్షరూపాయలకు మించినది. ఇందులో మూడువేల ఏడువందల రూపాయలు స్వతంత్ర అఖ్యదయ ప్రజాపక్షం తరఫున విరాళ మొసంగబడెను.

# తెలుగు వక్తృత్వంపోటీ

## లాకాలేజి విద్యార్థులకు రోలింగు కప్పు

మద్రాసు, నవంబరు 6: వాల్మీకి వెంకటేశ్వరశాస్త్రులుగారి రోలింగుకప్పు తెలుగు ఉపన్యాసాల పోటీ మైలాపూరు బి. ఎం. బి. ఎ. యందు నిన్న సాయంకాలం జరిగెను. బి. ఎస్. మూర్తి, ఎం. వెంకటరంగయ్య, డా॥ బి. వి. సీతాపతిగార్లు జడ్జీలుగా నుండిరి. ఇండియాను భాషాప్రయుక్త రాష్ట్రాలుగ విభజించుట గూర్చి అభ్యర్థులు ఉపన్యసింప కోరబడిరి. 58 మంది విద్యార్థులు పోటీచేసిరి. రోలింగు కప్పులా కాలేజి జట్టు ఎస్. వి. కె. సూర్యప్రకాశరావు, చి. రాఘవయ్యగార్లకు ఒసంగబడెను. ప్రథమ బహుమతి ఎస్. వి. కె. సూర్యప్రకాశ రావుగారికి, 2. టి. సీతారామాచారి (పచ్చయ్యప్ప కాలేజి) 3. మిస్ ఎం. కౌసెల్యగారికి (క్వీన్సుమేరీ కళాశాల) ఒసంగబడెను.

# ఆయుర్వేద వ్యాప్తికి మహోత్కృష్టమైన సేవ

## డాక్టర్ జోగేశ్ చంద్రఘోషు విజ్ఞాపనకు భారతప్రభుత్వమువారి సమ్మతి.

ఢక్కాలోని సాధనఔషధాలయ అధ్యక్షులైన డాక్టర్ జోగేశ్ చంద్రఘోష్ భారతదేశములో ఆయుర్వేద వ్యాప్తికి మరియొక పర్యాయం మహోత్కృష్టమైన సేవ గావించిరి. ఆధునిక భారతదేశమున ఎంతో శ్రమపడి నిర్మించిన ఆయుర్వేద సౌధము పాకిస్తాన్ నిర్మాణ ఘాతమువల్ల శిథిలమగుటకు సిద్ధముగా నుండెను. డాక్టర్ ఘోష్‌గారి నిరంతర కృషియు, భారతప్రభుత్వమువారి ఔదార్యము ప్రస్తుతము అట్టి అనర్థకమును తొలగించినవి.

పాకిస్తాన్ నుంచి దిగుమతియగు కొన్ని తరగముల సరకులమీద ఈ యేడు ఏప్రిల్ నెలలో భారతప్రభుత్వమువారు కస్టమ్సు డ్యూటీ విధింపవలసి వచ్చెను. ఆయుర్వేదౌషధములకు వాటి ఖరీదుమీద 30% న్నుంచి కొన్నిటికి సదరు ఎక్కువటికి రెండింతలుగాను డ్యూటీ విధింపబడెను.

జోగేశ్ చంద్రఘోష్

ఒకనాటికి భారతదేశము విభజింపబడనప్పుడు ఎవరును ఊహించి యుండనందున, అర్థమైన అసలు ఆయుర్వేదౌషధములను తయారుచేయు గొప్ప ఫర్మలలో కొన్ని అప్పుడు పాకిస్తానులో నున్న ఢక్కాయందు పెద్ద పెద్దవైనవి. డాక్టర్ ఘోష్‌గారి ప్రఖ్యాత సాధన ఔషధాలయము అట్టి కంపెనీలలో ఒకటియై యున్నది. దీనికి భారతదేశమందంతటను 120 బ్రాంచిలు 2000 ఏజన్సీలు కలవు. ఈ కంపెనీ లక్షలకొలది ప్రజల వైద్యావసరములను తీర్చుచున్నది సరిహద్దు రెండు వైపుల నున్న వివిధములగు కస్టమ్సు లాంఛనములు, అత్యధికముగ విధింపబడిన కస్టమ్సు డ్యూటీ భారము ఈ పరిశ్రమను దాదాపు నాశనమొనర్చినవి. తత్ఫలితముగ భారతదేశములోని లక్షలకొలది ప్రజల ఆరోగ్యమునకు భంగము వాటిల్లెను. ఆయుర్వేదౌషధములలో నున్న ప్రధాన సౌకర్యములలో నొకటి అవి చౌకగా లభించుట. నిరుపేదమైన ప్రతి భారతీయునికి అవి అందుబాటులోనుండును. ఇపుడు విధింపబడిన డ్యూటీయే అట్టి సౌకర్యమును అపహరించినది

స్వాతంత్ర్యము పొందిన తరువాత భారతదేశము ఇప్పుడిప్పుడే ఒక సహజస్థానము నందు కొనుచున్నది భారతీయుల స్వకీయ ప్రతిభా విశేషమున కనిపెట్టబడిన ఆయుర్వేదము ప్రపంచమున అతి ప్రాచీనమై నిర్దుష్టమైన, వైద్యవిధానము విషయము. నెమ్మదిగా భారతీయులలో అన్ని తరగతులవారి చేత గ్రహింపబడుచున్నది అట్టి సందర్భములో, సాధనఔషధాలయ వంటి గొప్ప కంపెనీలు మాత్రమే పూర్తిగా తయారుచేసి యివ్వగల అమోఘమగు అసలు ఆయుర్వేదౌషధములు తగినంతగా సరఫరా కాకపోయినను, అవి ఎక్కువ ఖరీదు గలవిగా గణింపబడినను, ప్రజలు సహజముగా విదేశ వైద్యవిధానమునకు మరలెదరు. ఈ పరిస్థితి భారతదేశములో ఆయుర్వేద అభ్యుదయ అవకాశములకు అటంకము కలుగజేసెడిది.

భారతదేశపు జాతీయ ప్రభుత్వము ఆయుర్వేదౌషధములపై కస్టమ్సు డ్యూటీ విధించుటకు గావించిన నిర్ణయమువల్ల యేర్పడిన 'ఈ ఫలితముల గురించి వారికి డాక్టర్ జోగేశ్ చంద్రఘోష్‌గారు అనేక వ్యాసములు నివేదించి యుండిరి. భారతదేశ నాయకులలో అగ్రగణ్యులైన జాతీయ ప్రభుత్వమువారు నిజముగా ఈ ఫలితములను ఉద్దేశించి యుండరు. డాక్టర్ ఘోష్‌గారు తన కృషికి తోడుగా అఖిల భారత విఖ్యాతిగల వైద్యుల యొక్క ముఖ్యముగా అఖిల భారత ఆయుర్వేద మహాసమ్మేళన నాయకులగు శ్రీయుత మహేంద్రకుమార్ శాస్త్రోపాధ్యాయ, శ్రీయుత జి. డి. సరస్వత్ మున్నగువారి సహాయ ప్రాబల్యమును పొందిరి. కలకత్తా హైకోర్టు బారిస్టరు డాక్టర్. ఎస్. కే. చక్రవర్తిగారి వాదన సామర్థ్యము వారికి తోడుగా నుండెను డాక్టర్ ఘోష్‌గారి వాదనలోని విలువను భారతప్రభుత్వమువారు వెంటనే అంగీకరించి పాకిస్తాన్ నుండి దిగుమతియగు ఆయుర్వేదౌషధములను కస్టమ్సు డ్యూటీనుండి మినహాయింపుచు ఉత్తరువులను గావించియుండిరి.





# వారఫలాలు

శ్రీ రావినూతల ఆంజనేయులు

నవంబరు 7-వ తేదీ మొదలు 13-వ తేదీ వరకు

### గ్రహస్థితి

రవి బుధులు (తుల) కుజుడు (వృశ్చికం) గురువు (ధనుస్సు) శుక్రుడు (కన్య) శని (సింహం) చంద్రుడు (మకర కుంభ మీనాల్లో) రాహువు (మేషం) 7 బుధ చంద్ర, రాహుచంద్ర (కేంద్రం) (8) శుక్ర చంద్ర (కోణం) 10 బుధచంద్ర బుధచంద్ర (కోణం) శనిచంద్ర సమసప్తకం 11 శని రాహు కోణం కుజచంద్ర (కేంద్రం) 12 గురుచంద్ర (కేంద్రం) 13 బుధ కేతు (యుతి.)

### ధరలు

**ప్రత్తి (జార్జిల్లా) నూలు - వస్త్రాలు**

మార్కెట్టు ఇరుసైపులా యుంటుంది ఓర్పు ఉంచలేనివారూ అమ్మినవారూ స్వల్పం లాభం పొందవచ్చు.

**వెండి-బంగారాలు**

ఈ వారంలో చలామణి స్వల్ప ప్రోత్సాహకరం.

**వాటాలు**

8, 9 ల్లో స్వల్ప అభివృద్ధి కలిగి తరువాత నిలకడ.

**ధాన్యములు-ఆహారవస్తువులు**

పొట్టుధాన్యములకు నిలకడ. నూనెలూ, ఆముదాలూ, వేరుశనగపప్పు కొనడం లాభకరం. నెయ్యి, దుంపలూ కొంత తిర్గను. (1949 మార్కెట్టు ఈటీత సంపాతకు కొంటి, నెల్లూరు జిల్లాకు రిస్టైముకనరు (వాటి కనుగొనండి.)

### లగ్నఫలాలు

**మేషం (అశ్వని, భరణి, కృత్తిక, 1పాదం)**

ఈ వారంలో పరిస్థితులు గతవారంలో కన్నా మేలుగా యుండగలవు. అదనుకు తగిన ఆలోచనలు తట్టినమే కొత్తకుంటూ సలహో సహాయాలు అమరుతవి. ఆర్థిక స్థిరత పోరాటాలను ముందుకు నెట్టక లుగుతారు. 7, 8 ల్లో ప్రయాణం- అప్పులను కలియడం లాభకరం. 9, 10, 11 ల్లో పరిష్కారాలు ముగించవలసింది. వారాంతంలో ముఖ్య కార్యక్రమానికి ఆటంకాలు ఎక్కువ. 9, శుభవార్త. 13, అవులింతలూ, అజాగ్రత్త.

**వృషభం (కృత్తిక 2, 3, 4 రోహిణి మృగశిర 1, 2. పాదాలు)**

ఈ వారంలో గ్రహబలం మీకు అనుకూలంగా యుంటుంది. వినుకుతో వృత్తి ఉద్యమాలు ప్రారంభింపబడతవి. కాని అప్పుల ప్రోత్సాహంవల్ల చురకు కలిగి యుండుకు పోకలిగారు. వ్యాపారం లాభిస్తుంది. ఉద్యోగ నౌకరీల్లో పైఅధికారులకు సమాధానంగా నడుచుకోన కలుగుతారు. 9, 10, 11 ల్లో ప్రయాణం-కార్యావసరంపై గౌరవస్థులను కలియడం కలుగుతుంది. 12, 13 ల్లో పరిష్కారాలు లాభకరం. 12, శుభవార్త.

**మిథునం (మృగశిర 3 4 పాదాలు ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పాదాలు)**

ఈ వారంలో పరిస్థితులను 11 సాయంత్రంవరకూ కొంత జాగ్రత్తతో గమనించడం అవసరం. ప్రథమంలో మిత్రులు ఆశాభంగం కలిగిస్తారు. తర్వాత వ్యాపారాదుల్లో కాలయాపనంవల్ల అవకాశాలు జారిపోతవి. ఎంత తెలివితేటలున్నా దైవబలం లేందే వృథా అని విసుగుకలుగుతుంది. వారాంతంలో ప్రయాణం, స్వజన పౌరరీత్యా మర్యాదస్థులను కలవడం లాభాకరం. పరిష్కారాలపై వారానికి మార్చండి.

**కర్కాటకం (పునర్వసు 4, పుష్యమి ఆశ్లేష)**

ఈ వారంలో 9 మధ్యాహ్నంవరకూ యత్న కార్యాలు సుముఖంగా యుంటవి. ప్రథమంలో చిన్న ప్రయాణం. బంధువులతో ముచ్చటింపులూ, విందులతో ఎక్కువకాలం గడిచిపోతుంది. కాని ఆ మధ్యాహ్నం తరువాత మీరు ముందుకు పోలేని పరిస్థితులు కలుగుతవి. పరిష్కారాలు ఆగుతవి. ఆరోగ్యం సరికాదు. సమాజంలో ఓర్పు పడలుతుంది. 8 శుభవార్త. 13 కలహం.

**సింహం (మఖ, పుబ్బ, ఉత్తర 1పాదం)**

ఈ వారంలో 11 సాయంత్రంలోగా త్వరపడి ముఖ్యకార్యక్రమం ముగించడం అవసరం. 12.13 ల్లో ఆరోగ్యం సరిగా లేకపోవడం - సంఘంలో ఒత్తిడికలిగించే పరిస్థితులూ ముందుకు రానివ్వవు. 7, 8, 9 ల్లో పరిష్కారాలూ, వ్రాతలూ, నూతన యత్నం- 9, 10, 11 ల్లో ప్రయాణం సభ కార్య ప్రస్తావనలూ లాభకరం కాగలవు. 8 సుభవార్త, 13 కంటి-తలనొప్పి.

**కన్య (ఉత్తర 2 3 4 పాదాలు హస్త చిత్త1, 2 పాదాలు)**

ఈ వారంలో వ్యాపార ఉద్యమాల్లో మీ కార్యక్రమం నిరుత్సాహంతో ప్రారంభింపబడి వారాంతానికి ముగించబడుతుంది, ప్రథమంలో సమాజిక పరిస్థితులు ఆశాభంగం కలిగించగలవు. వ్యాపారం కూడా ఎదుడు ఒడుకుగా యుంటుంది. కాని 9 మధ్యాహ్నంనుంచి ముందుకుపో కలుగుతారు. ప్రథమంలో కలిగిన ఆర్థిక చిక్కులు వదులుతవి 9, 10, 11 ల్లో పరిష్కారాలూ, 11, 12, 13 ల్లో ప్రయాణం లాభకరం.

**తుల (చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

ఈ వారంలో పరిస్థితులు మీకే విచిత్రంగా అగపడుతవి. మీ వ్యవహారం త్వరలో ముగించ తలపెట్టుతారు గాని, అటంకాలు కలిగి ఆగడం- అనుకోనివి ముగించ కలగడం వీస్తుకుంది. మొత్తంమీద మీ సేవికి కన్న కుట్టి ... గ్రహించకలుగుతారు. ప్రయాణం కలుగుతుంది. ఎగుమ చూచే అప్పులు ఆశాభంగం కలిగించకలవు. వారాంతంలో పరిష్కారాలూ, వ్రాతలూ, ముగించండి. 12 శుభవార్త.

**వృశ్చికం (విశాఖ 4 పాదం, అనూరాధ జ్యేష్ఠ)**

ఈ వారంలో 9 మధ్యాహ్నంలోపుగా ముఖ్యకార్యక్రమం ముగించడం అవసరం తర్వాత ఆటంకాలు ఎక్కువగాయుంటవి. ఆరోగ్యంకూడ తృప్తికరంగా యుండదు. ఎదురుచూచేమార్పులు ఎంతకూ కలగకందువల్ల విసుగుకలుగుతుంది. ప్రయాణం, సాగదు. అప్పులు ఆశాభంగం కలిగిస్తారు మొత్తంమీద అన్ని వ్యవహారాలూ జాగ్రత్తతో చూచుకోవడం అవసరం. 8 శుభవార్త.

**ధనుస్సు (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పాదం)**

ఈ వారంలో 9 మధ్యాహ్నంలోగా మీ కార్యక్రమాన్ని నిలకడగల మనస్సుతో జరుపలేరు. స్వకుటుంబమునకూ-పై కొంత ఆటంకం దూరంగా యుంచండి. తర్వాత 11 సాయంత్రంవరకు పరిష్కారాలు లాభకరం. మిత్రులు చురుకుకలిగిస్తారు. వ్రాతలు ముగించండి. వారాంతంలో, భోజనశయన సౌఖ్యంతక్కువ. 10 శుభవార్త.

**మకరం (ఉత్తరాషాఢ 2, 3, 4 పాదాలు శ్రవణం, ధనిష్ఠ 1, 2 పాదాలు)**

ఈ వారంలో మీ స్థితి గ్రహబలం ప్రోత్సాహకరంగా యుంటుంది. ఉత్సాహంతో చురుకుకలిగి కార్యక్రమం జరుపకలుగుతారు. వ్యాపారాదుల్లో ఫలితం కూడా ప్రోత్సాహకరం కాగలదు. 7, 8, 9 ప్రయాణానికి మేలు. అప్పు గా, రొప్పవారినీ కలుస్తారు. ఉద్యోగ నౌకరీల్లో అధికారుల మన్నన కలుగుతుంది 11, 12 పరిష్కారాలూ, వ్రాతల ముగింపులకూ మేలు.

**కుంభం (ధనిష్ఠ 3, 4 పాదాలు శతభిషం పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు)**

ఈ వారంలో పరిస్థితులు కొంత అస్థిరంగా యుంటవి ప్రథమంలో కృషి ఖర్చులు చేసి ఇతరుల సహాయంకొరకు పాటుపడవలసి యుంటుంది. 9 మధ్యాహ్నంనుండి 11 లోపుగా మీ శ్రేయస్సు అనుగుణంగా ఎదురు మాటచేవారిని కలుస్తారు. ఉద్యోగ నౌకరీల్లో ఉత్సాహం యుండదు. వ్యాపారాదుల్లో ముందుకుపో ప్రయత్నాలు కలుగుతవి. కాని ఆటంకాలు ఎక్కువ. 10 శుభవార్త. ఆ స్తసమాగమము.

**మీనం (పూర్వాభాద్ర 4 పాదం ఉత్తరాభాద్ర, రేవతి)**

ఈ వారంలో పరిస్థితులు గతవారంలో కన్నా ప్రోత్సాహకరం కాగలవు. నాగ్య రాజ్యాన్ని పనుల స్వగృహాల్లో నమ్మదిగా రాజకీయాల్లో ప్రవేశం కలిగించకలదు. సూక్ష్మంకూడా సుగమముగా యుంటుంది, 9 మధ్యాహ్నంవరకు పరిష్కారాలకూ, వ్రాతల ముగింపులకూ మేలు. వారాంతంలో ప్రయాణం లాభకరం. శుభవార్త.

# గ్రంథ సమీక్ష

### "స్వతంత్ర" వార్షిక సంచిక (ఆంగ్లము)

ప్రకాశకులు, సంపాదకులు ఖాసా సుబ్బారావుగారు, 158 లాయిడ్స్ రోడ్, రాయపేట, మద్రాసు. వెల 1-8-0.

శ్రీ ఖాసా సుబ్బారావుగారి సంపాదకత్వాన వెడలే, ఆంగ్ల స్వతంత్ర పత్రిక వార్షిక సంచిక, సుప్రసిద్ధ గాయకురాలు శ్రీమతి సుబ్బలక్ష్మి త్రివర్ణ చిత్రం ముఖచిత్రంగాఅలరారుతూ, త్రివర్ణ చిత్రాలతోనూ, సుప్రసిద్ధ రచయితల వ్యాసాలు, కథలతోనూ, అందంగా వెలువడింది.

దేవీ ప్రసాద్ రాయ్‌చౌదరీ చిత్రించిన "లంబాడీ స్త్రీ", యస్. శ్రీనివాసయ్యంగారి మనుమరాలు, శ్రీమతి వాసంతి కృష్ణస్వామి చిత్రించిన శ్రీనివాసయ్యంగారి త్రివర్ణ రూపచిత్రము, శ్రీ వీణా ధనమ్మ రూప చిత్రము మొదలైన త్రివర్ణ చిత్రాలూ, వాయకులహావభావాల చిత్రాలూ రచనలకు పోషకంగా, పుష్టినిస్తూ, ప్రతిభ కు రమణీయతను కూర్చాయి.

డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు రచించిన "బాబూ రాజేంద్ర ప్రసాద్", శ్రీమతి సరోజినిని గురించి ఆమె సోదరుడు హరీంద్రనాథ చట్టోపాధ్యాయ, సంగీత విద్వాంసురాలు వీణాధనమ్మను గూర్చి, సంగీత శాస్త్రజ్ఞుడు టి. టి. క్రిష్ణమాచారిగారు, లెనిన్ గూర్చి ఫిలిప్ స్ప్రాట్, శ్రీమతి యం.యస్. సుబ్బలక్ష్మిని గురించి టి.వి.ఆర్. మొదలైన జీవిత చిత్రణాలకరచనలువిమర్శా విశ్వాన్ని ఒట్టి, అనపూర్వక తత్త్వమనుభవంగల వ్యక్తుల రచన లవటం మరింతగా భాసిస్తున్నాయి.

పాబ్లో జోసఫ్, యం. చలపతిరావు, యస్. పార్థసారథి, మొదలైన ప్రసిద్ధుల రాజకీయ సాంఘిక వ్యాసాలూ, మామూలు కన్న సున్నితమయినపోలులో, "స్వాప్నికత నావిక" తప్పించుకున్న విప్లవకారుని కునికిపట్లంగ్ల రచనా, కార్టూనులు, సుప్రసిద్ధ కథకులు మంచేరీ ఈశ్వరన్, విజయ తుంగ, గోపాలస్వామిగార్ల చిన్నకథలు, సంపాదకుడే తిరగబడ్డ "కాకా" మామూలు సర్వీక విమర్శలూ, సంచికకు, శోభ సృష్టినీ ఇచ్చాయి. మొత్తం 120 పేజీలతో అన్నివిధాలా పత్రిక ప్రశంసనీయంగా వెలువడింది.

* * *

### 1. స్వాతి తిరునాళ్ : తిరువాన్కూరు మహారాజావారి 24 కీర్తనలు

ఇందలి నేటి నవరాత్రి కీర్తనలు ఆంధ్రానువాదము సాహితీవల్లభ శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారిచే రచింపబడినవి. నూజివీడులో శ్రీ గౌరీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

### 2. తులసీదాసు చరిత్రము

సాహితీవల్లభ శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు నూజివీడు ప్రభువులచే విరచితము. సంగ్రహ తులసీరామాయణము హిందీమాతృకసహా తులసీదాసు కృతి "రామచరిత మానసము" నందలి 64 గేయముల సంపుటి — సంగ్రహ రామాయణ టీకా సహితం — నూజివీడు లోని శ్రీ గౌరీ ప్రెస్‌వారిచే ముద్రితము.

### 3. పురందరదాస్ చరిత్ర-కీర్తనలు

కర్ణాటాంధ్రలిపులలో భావటీకతో ప్రచురితమైన 12 కీర్తనలు నూజవీటి ప్రభువులు సాహితీ వల్లభ శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు ప్రకాశకులు—నూజివీడులోని శ్రీ గౌరీముద్రాక్షరశాలయందు ముద్రితము.

### 4. ధరా సూర్యనారాయణ దండకము

ప్రకాశకులు: నూజివీటి ప్రభువులు "సాహితీ వల్లభ" శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావుగారు. నూజివీడులోని శ్రీగౌరీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

### 5. చిద్విలాస శతకము

గ్రంథకర్త: సురభి నాట్యకళా స్థాపనాచార్య, హరికథా ప్రవీణ ఆస్థాన సుబ్బదాసు యోగి. నిగమాగ్ర చంద్రోదయ గ్రంథమాల వారి 8 వ కిరణము. వెల 0-12-0. నిగమాగ్ర చంద్రోదయ గ్రంథమాల, ధర్మవరము.

### 6. పాల్కురికి సోమనాథ కవి

గ్రంథకర్త: విద్వాన్ కాళేశ్వర బండారు తిమ్మయ్యగారు శివధర్మ గ్రంథమాల వారి 12 బిల్వము. వెల రు 2-8-0. వలయువారు శివధర్మ గ్రంథమాల, సికింద్రాబాదు అని వ్రాయవలెను.

